




# వేదములు

## విచారణ

## వేద స్వరూపము - 1





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit,<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఐవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# వేదస్వరూపము



(ప్రథమ సంపుటము)



గ్రంథకర్త:
"దైవజ్ఞసార్వభౌమ"
"వేదార్థప్రవీణ"
చిఱ్ఱుకుల వేంకటరమణశాస్త్రి



—: ప్రచురణకర్తలు :—
వేదవిజ్ఞానసమితి, ఉయ్యూరు.
1952

# విషయసూచిక



# ఉపోద్ఘాతము

బందరు, ఈ జేపల్లిలో జరిగిన వేదసభలో "తైత్తిరీయ శాఖలోని ఋక్కులు"నుగూర్చి నేనిచ్చిన ఉపన్యాసమును వినిన ఆస్తికుల ప్రోత్సాహమే ఈ గ్రంథరచనకు మూలము. ఋగ్యజుస్సామాథర్వణములనుగూర్చియు, మంత్రబ్రాహ్మణ ఆరణ్యక ఉపనిషత్తులను గూర్చియు, ప్రాచీన, నవీనులమధ్య భిన్నాభిప్రాయములున్నవి. అందేదిన్యాయమో ప్రతివారును నిర్ణయించుకొనుట కనువగు విషయప్రదర్శనమే ఈ "వేద స్వరూపము"యొక్క ముఖ్యోద్దేశ్యము.

"నఖ్యాతిలాభపూజార్థం మయాగ్రంథః ప్రణీయతే।
స్వబోధపరిశుద్ధ్యర్థం బ్రహ్మవిన్నికషోపతే"

అను సురేశ్వరాచార్యోక్తిననుసరించి, నాకున్న వేదార్థ పరిజ్ఞానమును, వేదవేత్తలయందు పరీక్షించుకొనుటయే నా ఉద్దేశ్యముగాని, ఖ్యాతిలాభపూజాదులుగావు.

సర్వవేద తాత్పర్యమును 40 పుటలలో సంక్షేపముగా ప్రదర్శించి, కృష్ణయజుర్వేదములోని తైత్తిరీయశాఖలోని సర్వ విషయసమీక్ష చేయబడినది. ముందుద్వితీయాది సంపుటము లలో, ఋక్సామాథర్వణ వేదములలోని సర్వవిషయ సమీక్ష చేయుచు, నాలుగు వేదములకును పరస్పర ఏకవాక్యత, మంత్రబ్రాహ్మణోపనిషత్తులకేకవాక్యతలు వివరింపబడును. ఆ

పైని వేదములందలి, గణిత, పదార్థవిజ్ఞాన, రసాయన, జంతుశాస్త్ర మనస్తత్వ, శారీరకాది సర్వశాస్త్రములెంత విపులముగా నున్నవో వివరింపబడును.

నావద్ద వేదాంత శ్రవణమొనర్చుచున్న ఉయ్యూరులోని వేదవిజ్ఞానసమితివారీ ప్రథమసంపుటమును ముద్రించిరి. ఏతత్కార్యాసక్తిగల ఆస్తికులు ద్వితీయాది సంపుటములను గూడ ముద్రింప తోడ్పడెదరుగాక!

ఇందే గుణములున్నను అవి నాగురువులవి. దోషములున్న యెడల నావి. సప్రమాణముగా దోషములను తెలుపుచో ద్వితీయాది ముద్రణమందు సవరింపబడును.

మకాం:
**ఉయ్యూరు.**
నందన సం॥ర. కార్తికపూర్ణిమ

ఇట్లు,
సుధీవిధేయుడు
— గ్రంథకర్త

*

శ్రీః

# వేదస్వరూపము

శ్లో॥ నారాయణ సమారంభాం విద్యాశంకర మధ్యమాం।
కల్యాణానంద పర్యంతాం వందేగురు పరంపరాం॥

శ్రీ మహాగణపతయేనమః

ఆసేతుశీతాచల మధ్యవర్తియగు నీభారతావనియందు అనాదికాలమునుండియు "వేదము" అనుపేరుగల వాఙ్మయము ప్రసిద్ధ వ్యవహారమును గనియున్నది. ఇది అత్యంత ప్రమాణమని భారతీయుల విశ్వాసము. మనువు మొదలగు మహనీయులుకూడ దీనిప్రామాణ్యమును పరమావధిగానెంచి, ఈ వేదబోధలను సంగ్రహముగా స్మరించి సామాన్యజనులకుబోధించిరి. ఇవియే స్మృతులనబడుచున్నవి. ఇట్లే స్కాందాదిపురాణములు, రామాయణాది ఇతిహాసములు, రఘువంశాది కావ్యములు; వేయేల! సుమతిశతకము మొదలుగాగల భారతీయ వాఙ్మయమంతయు ఈ "వేదము" ను మూలప్రమాణముగా గ్రహించి ఆయాప్రమేయమును బోధించినవి. గాన ఇట్టి వేదస్వరూపమును సమగ్రముగాను, సంగ్రహముగాను ప్రతివారు తెలుసుకొనగల్గుటకీ చిన్నవ్యాసముద్దేశింపబడినది.

వేదమనగా తెలివి లేక తెలుసుకొనుట — జ్ఞానము విద్య; బోధ, ఇత్యాదులు దీనిపర్యాయపదములు (ప్రారంభములో 1 తెలుసుకొను వాడైనకర్త 2 తెలియబడు విషయమైన కర్మ 3 తెలుసుకొనుట యను క్రియ. ఈమూడును అవశ్యముగా నుండి తీరవలెను. పరిపాకావస్థలో ఈ మూడును కలసి ఏకాకారము నొంది "తెలివి"యగును. ఇందేయొకటి తక్కువైనను ఈ తెలివి పూర్తిగాదు. కావున సమస్తజగత్తులోను ఎన్నివిధములగు కర్తలుందురో ఎన్నివిధములగు తెలియదగిన పదార్థములు (కర్మలు)ండునో తెలుసుకొనుటకు ఎన్నివిధములగు క్రియలుండునో వాటినన్నిటిని పూర్తిగా వివరించి బోధించి ఏకాకారమగు జ్ఞానముగానున్నదో అదియే "వేదము"

ఇది మూడుస్థాయిలలో నేర్పడును. అవియే కర్మ ఉపాసనా జ్ఞానములన బడును ఎట్లనగా ఒకవిషయము బోధపడవలెనన్నచో ఆవిషయము నెరిగిన వారివద్ద తెలుసుకొనుట గ్రంథమునభ్యసించుట బోధింపబడు కాలమందు తనకనసరమగు సందేహానివృత్తికర విషయములను వ్రాసుకొనుట ఇత్యాదిగురుశిష్య దేహేంద్రియ మనోవ్యాపారములు, దీపము, కలము, కాగితము మొదలగు పరికరములు ఇవన్నియు ఆవశ్యకములు. ఇది తెలుసుకొనుటలో ప్రథమావస్థ లేక తెలివి యొక్క ప్రథమస్థాయి గాన వేదములోని కర్మభాగమని పరిభాషించుట ఉపపన్నమే యగుచున్నది.

ఈ తెలుసుకొనువాడు అనేకమారులు తదర్థమును మననమొనర్చి అందలి సాధక బాధకముల నాలోచించి తృప్తి

నిరవగు సమాధానము గోచరించువరకు మనస్సులో ఆవృత్తి నొసర్చు రూపిని పొందును. ఇది తెలుసుకొనుటలో ద్వితీయావస్థ లేక తెలివియొక్క ద్వితీయస్థాయి. ఇందు శిష్యునియొక్క మనోవ్యాపార మొక్కటి తప్ప మిగిలిన సాధనములతో నిమిత్త ముండదు. ఇదియే వేదములోని ఉపాసనా భాగమనబడును.

ఆపైన ఈ తెలివి తెలుసుకొనువాని స్వరూపమేయగు చున్నది. ద్వితీయస్థాయిలో తన యందనేక తెలుపులున్నను ఎప్పటికప్పుడు అనవరతము ఒక తెలివిమాత్రము మనస్సులో కార్యోన్ముఖముగానుండి మిగిలిన తెలుపులన్నియు కారణరూపముగా నుండుచున్నవి. కావుననే ఇన్ని తెలుపులును తనస్వరూపములైయున్నవి. చిన్నముల్లు కాలిలో గ్రుచ్చుకొన్నచో సహింపజాలనివాడు అనేక తెలుపులను ఎట్లు భరింపగలుగుచున్నాడు? ముల్లు తనకంటె వేరైనవస్తువగుట జ్ఞానము తన స్వరూపమే యగుటయే ఇందులకు కారణముగదా! ప్రతివాడును తన తెలివిని ప్రతిక్షణమందును వినియోగింప శక్తుడైయుండుట సర్వలోకానుభవసిద్ధము కావుననే వైద్యవిద్యయొక్క స్వరూపమే వైద్యుడు వైద్యుని స్వరూపమే వైద్యము. ఈ విధముగా సమస్త తెలుపులున్ను తెలిసినవాడున్ను ఏకరూపులగుచున్నారు. ఇప్పుడీజ్ఞానము నాతడితరులకు బోధింపగలడు. అందుల కవసరమగు అనేక బోధనా పద్ధతులను సృజింపగలడు. ఇదియే కారణజ్ఞానమనబడును. ఇది విద్యయొక్క తృతీయావస్థ. దీనినే వేదములోని జ్ఞాన భాగ మందురు.

ఇట్లనేక విషయములను తెలుసుకొన్న కొలదియు వీని జ్ఞానమభివృద్ధియగుచు, ఆయా విషయతాదాత్మ్యము నొందు

చున్నది. కాని వాని మొదటివిషయజ్ఞానము రెండవపరమయు జ్ఞానముతో కలిసి, ఏకాకారమును బొందుచున్నది ఎట్లనగా మనకు మనుష్యజ్ఞానము, సృష్టిజ్ఞానము, మొదలగు అనేక విషయజ్ఞానములు, మనస్సులో భిన్నభిన్నముగా నుండుచున్నవి గాని కారణరూపములో నేకాకారముగా నుండుట సర్వానుభవసిద్ధము. ఇంతేగాక ఒకడు ముందు గణిత శాస్త్రమును పూర్తిగా జ్ఞానియై ఆపైని పదార్థవిజ్ఞానశాస్త్రజ్ఞు యగుచో నాతడీ రెండు శాస్త్రసిద్ధాంతములను ఒకదానితో నొకటిని మేళవింపజేసి రెంటికి కారణ జ్ఞానములకు నున్నదెచ్చి ఏకత్వము నొందించును. ఇట్లాతడన్ని శాస్త్రముల నభ్యసించునో అన్నిటి కారణజ్ఞానములను మేళవింపజేసి ఏకాకారము నొందించును. ఇట్లు సమస్తజగత్తులోని, సర్వపదార్థములను, వాటి మూలకారణమును, ప్రత్యక్షముగా తెలుసుకొనుటయే ఈ తెలివికి పరమావధి. ఇదియే వేదశబ్దమునకు ముఖ్యార్థము. అట్టిజ్ఞానము యొక్క ఏకదేశము లేగదా! ఒక్కొక్క కారణజ్ఞానము! అట్టి దీనిఏకదేశములే ఉపాసనాభాగమున్ను, దానిఏకదేశములే కర్మభాగమున్ను దానిఏకదేశములే సర్వజగత్తున్ను, యను సంగతి యుక్తిసహమున్ను, ప్రమాణమున్ను అయియున్నది.

# వేదనిత్యత్వము

జ్ఞానియగు అధ్యాపకుడు, శిష్యునకు బోధింపదలచుకున్న జ్ఞానభాగమును తన స్వరూపమగు అఖండజ్ఞానములోనుంచి విభజించి తృతీయస్థాయిలోనికివచ్చి క్రమముగా ద్వితీయ

స్థాయికి, ప్రథమస్థాయికివచ్చి శిష్యునకుప దేశించును. శిష్యుడు ప్రథమస్థితిలో గ్రహించి ద్వితీయస్థితిలో మనన మొనర్చి తృతీయ స్థితిలో కారణరూపము నొందించును. ఇట్లే వేద మొక్కటియే అధికారులబట్టి ఆరోహణ అవరోహణ క్రమములచే ప్రవర్తిత మగుచు, స్థాయి భేదము నొందుచున్న దేగాని స్వరూపముచే ఏకరీతిగానున్నది. ఎందరు గురు శిష్యులుమారుచున్నను వేదము మారుట లేదు.

ఈ వేదము ప్రథమస్థాయిలో గురు శిష్యుల స్థూల దేహేంద్రియాదుల నాశ్రయించి ఉన్నంతవరకు ఇంద్రియవృత్తి లో ఉన్నట్లును ఆ ఇంద్రియవృత్తి నశించుటతోనే నశించినట్లును ఉండును. ద్వితీయస్థాయిలో మనస్సును లేక సూక్ష్మదేహము నాశ్రయించి యున్నందున మనస్సున్నంతవరకు ఉన్నట్లును లేనపుడు నశించినట్లును భాసించును. తృతీయస్థాయిలో కారణ దేహము నాశ్రయించి యున్నందున అదిఉన్నంతవరకు ఉన్న ట్లును లేనపుడు నశించినట్లును భాసించును. తెలివిమాత్రము ఇన్నిస్థాయిలలోను ఏకరీతిగానున్నది. ఆశ్రయభేదముచే భిన్న ముగాను అనిత్యముగాను భాసించును.

ఇందు ప్రథమస్థాయికంటె ద్వితీయస్థాయి ఎక్కువ కాలమును అంతకంటె తృతీయస్థాయి ఎక్కువకాలమును ఉండుట సర్వలోకానుభవమైనది గాన ఈ తెలివి ఉత్తరోత్తర శ్రేష్ఠముగా నున్నది. ఈ త్రివిధజ్ఞానమే ప్రతిజీవునియొక్క స్వరూపము. దేహేంద్రియాదులు ఆ తెలివియొక్క ప్రస్తార ములై దానిని సూచించును. అనగా ఒకరీతిగా ఈ త్రివిధజ్ఞాన

ములున్నట్టి పశు మనుష్యదేహము, ఇంకొక రీతిగానున్నట్టి పశు దేహము ఈ ప్రకారము జ్ఞానోత్కర్షచే మనుష్యాది బ్రహ్మ లోకపర్యంత దేహములున్న జ్ఞానాపకర్షచే మనుష్యాది స్థావరాంత దేహములున్ను ఏర్పడుటయు సిద్ధమేయగును. ఇంక స్థాయిలోని తెలివి ఎట్టి స్థితిని పొందుకొనవలెనో కూడ ఈ వేదమే బోధింపవలెనుగదా! అధ్యాత్మక్షేత్రజ్ఞ జ్ఞానము లేక క్షేత్రాశ్రయజ్ఞానాభివృద్ధికి సాధనమగుట సార్వజనీనము.

కావుననే గురుశిష్యులను ఆశ్రయములులేక ఉపాధులు మారినంతమాత్రముచే నీ వేదము మారక పోవుట వలననే ఒక దేహముతో సంపాదించిన తెలివి ఆ దేహ మరణముతో నశింపక మరియొక జన్మలోని కనుసరించుట సోపపత్తికమే యగుచున్నది. ఏలననగా ఈ తెలివి ప్రథమస్థాయినుంచి క్రమముగా నుత్తమస్థాయినొందు స్వభావముగలదియు. నిత్యమైనదియు నగుటచే, ఏయే తెలువులు ఏయే స్థాయిలోనుండగా ఈ ఆశ్రయమగు దేహము పోవునో ఆ క్షణమే ఆయాస్థాయిల కనువగు దేహము నాశ్రయించును గావుననే ఈ దేహత్యాగకాలమున కాతని కెన్ని తెలువులు ఏయే స్థాయిలలోనుండునో వాటినిబట్టి అందులకనువగు దేవమనుష్యలతాది దేహములను ఈ తెలువులే సృజించి, పొందును. అందుచే కొందరు ఆజన్మసిద్ధులుగను, మరికొందరు కొన్ని విషయములలో అధికమైన తెలివికలవారుగను, ఇత్యాదిగా నేటికిని గోచరమగుచున్నారు.

ఇట్లు తెలివి మూడు స్థాయిలలోనుండి చివరకు పరమా
వధిని బొందినదని యిందు లోగడ చెప్పబడియెను. మూడవస్థాయి
లోగూడ శబ్దజ్ఞానము స్పర్శజ్ఞానము గంధజ్ఞానము
ఇత్యాదిభేదములు నాటియుండినవే యుండును విశ్వప్రపంచ
కములోని అన్ని పదార్థములయొక్కయు తాలూకు జ్ఞానము
పూర్తియగువరకు ఈ విశేషములుండును. తరువాత నిర్విశేషమగును.
ఇదియే ప్రతివారియొక్క నిజానుభవమగుటచే "ఆత్మ"యన
బడును. అన్నిటికంటె పెద్దదిగాన "బ్రహ్మ"యనబడును.
దేశ, కాలాదులచే విచ్ఛేదము లేనిదిగాన "సత్య"మనబడును. ఎన్న
టికిని నాశము లేనిదిగాన "అనంత" మనబడును. ఆనందమే
దీని స్వరూపము. ఇట్టిది వేదశబ్దమునకు ముఖ్యార్థము.

ఇట్టి పూర్ణజ్ఞానము, తృతీయస్థాయి, ద్వితీయస్థాయి
ప్రథమస్థాయి, అను పరంపరచే మాత్రమే తెలియనగునని యు
మరియొక ఉపాయ మెంతమాత్రము లేదనియు చెప్పుట ఉపపన్నమే
యగుచున్నది జగత్తులోని ప్రతిపదార్థమునందును ఇదియున్నది.
దీనియందు జగత్తంతయు భాసించుచున్నది. తెలివి మూడిన
కొలదియు, తదాశ్రయమగు దేహము మారుచున్నందున, ఆశ్రి
యమగు దేహాదిజగత్తంతయు అనిత్యము. ఈ వేదము లేక
జ్ఞానము మాత్రము నిత్యము. ఆశ్రయమగు దేహాది
జగత్తంతయొక్క ప్రామాణ్యము (యదార్థబుద్ధిజనకత్వము)
దీనిపై నాధారపడినది. అనగా ఈ జ్ఞానము పూర్తిగా తెలుసు
కొనునంతవరకు దేహాదికమే సాధనము. గాన జగత్తంతయు
"పరతః ప్రమాణము" – ఈ జ్ఞానముమాత్రమే "స్వతః

ప్రమాణము" – పురుషప్రయత్నముచే బుట్టినదిగాక, ఈ పురుషుల పుట్టుకకు పూర్వమందును, స్థితికాలమందును, లయకాలమందును, ఉండి, సర్వపురుషులకు స్వస్వరూపమైనందున ఈ జ్ఞానముమాత్రమే "అపౌరుషేయము" – అశ్రేయమై అనిత్యమగు జగత్తంతయు "పౌరుషేయము" అనగా తన ప్రయత్నముచే నేర్పడినది.

ఇట్టిజ్ఞానము నుపదేశించుటకు, ఎక్కడ ప్రారంభించవలయునో, అచటనుండి పూర్తిగా బోధకలుగునంతవరకు సమగ్రముగా నుపదేశించు వాఙ్మయమంతయు, "వేద" మనబడును కావుననే, వేదభాష్యకర్తలగు శ్రీ శబరస్వామియు శ్రీ విద్యాశంకర భగవత్పాదులును, శ్రీ విద్యారణ్యులున్ను "తాదర్థ్యాద్గ్రంథోపి వేద ఇత్యుచ్యతే" అనియుపదేశించిరి.

ఇక నీవేదములోని అవాంతర భేదములం దెలిసికొందము:-

# ఋగ్యజుస్సామవేదములు

తెలుసుకొనుటకు కర్త, కర్మ, క్రియలను మూడు పదార్థములవసరమని లోగడ చెప్పబడినది. ఏ వస్తువునైనను పుష్కలముగా తెలుసుకొనుటకు 1. ఆవస్తువ యేర్పడుటకు హేతువు, 2. ఆ వస్తువుయొక్క స్వరూపము, 3. ఆ వస్తువు వలన ప్రయోజనములు అను మూడింటిని పూర్తిగా తెలుసుకొనవలెను. అప్పుడే ఆ వస్తువు పుష్కలముగా తెలియబడగలదు. ఇందేదిలోపించినను ఆ తెలివి పూర్తిగాదు.

కావున అనేక విషయములను తెలిసికొను అనేక కర్తలనందరను, వారి స్వరూపములను, అందులకు హేతువులను వారి ప్రయోజనములను పూర్తిగా బోధించునదొక వేదభాగము. ఇది ఋగ్వేదమనబడును. అట్లే అనేక కర్తలచే తెలియబడు సమస్త జగత్పదార్థములను (కర్మలు) వాటి యన్నిటి స్వరూపములను అందులకు హేతువులను, వాటి అన్నిటి ప్రయోజనములను పుష్కలముగా బోధించునదింకొక వేదభాగము. ఇది సామవేదమనబడును. క్రియయనగా కర్తకు, కర్మకును సంబంధమును గలుపుటయేగదా! గాన సమస్త జగత్తులోని సర్వకర్తలచే, సర్వకర్మలకును సంబంధమును గలుగజేయు సర్వక్రియలను, అనగా ఎట్టికర్తకు ఎట్టివిషయము తెలియబడుటకు ఎట్టిక్రియ అవసరమో అట్టి సర్వక్రియలను, ఆ క్రియల స్వరూపములను, అందులకు హేతువులను అందుల ప్రయోజనములను పుష్కలముగా బోధించునదొక వేదభాగము ఇది యజుర్వేదమనబడును. ఈ ఋగ్యజుస్సామసంజ్ఞలకు గల ఉపపత్తులనేకములలో నిదియొకటి. ఉదాహరణద్వారా దీనిని వివరింతము.

రాముడను వాడు కృష్ణుడనువానినిగూర్చి తెలిసికొనగోరుచో రాముడుకర్త – కృష్ణుడుకర్మ – తెలిసికొనుట క్రియగదా!

## కర్మయొక్క వివరములు

1. కృష్ణుని స్వరూపము:— అతనిపొడవు, లావు, బరువు ప్రతిక్షణమందును పరిణమించుట, శబ్ద, స్పర్శ, రూప

రసగంధములు, వచనశదాన గమన విసర్గ ఆ నం ద ము లు, ఇత్యాదులన్నియు స్వరూపములే గదా!

2. ఈస్వరూపములోని సర్వవిశేషములను హేతువు పూర్తిగా తెలుసుకొనుట.

3 ఈస్వరూపములోని సర్వవిశేషములను ప్రయోజనములను పుష్కలముగా తెలుసుకొనుట— తాను చేయు క్రియ వలన తాననుకొన్న ప్రయోజన మొక్కటియేనా! ఇంకేమైనా ప్రయోజనములు గలవా? అనునీమాటిని పూర్తిగా తెలుసుకొన్నపుడు కర్మనుగూర్చి తెలుసుకొనుట పూర్తియగును.

## కర్త యొక్క వివరములు

1. కర్తయగు రాముడు కృష్ణుని వాడవు తెలుసుకొనుట కెట్టిక్రియ నొనర్చవలెను? అట్లే లావు మొదలగు అన్ని గుణస్వరూపములకును ఎట్టిక్రియలు?ఇవియే తనయందలికర్తృత్వ స్వరూపము.

2. ఈ అన్నికర్తృత్వములకును హేతువులు.

3. ఈ అన్నికర్తృత్వములకును ప్రయోజనములు— తనకు యితరులకు ఎవరెవరికి ఎన్నిప్రయోజనములు? అనునీమాటిని పూర్తిగా తెలుసుకొనవలయును.

## క్రియ యొక్క వివరములు

1. క్రియయనగా కర్తయందలి వికారము గదా! రాముడు నడచుచున్నాడు. అనువాక్యమునందు నడచుట

యచ్చ్రియ రాముని వికారమనుట నిర్వివాదము (యదాశ్రయా క్రియాతమ విషయీకుర్వతీ నైవాత్మానం లభతే- శంకరభాష్యం)

అతనిలాగును తెలుసుకొనుటయను తనవికారమునకు స్వరూపము; అట్లే కృష్ణుని శబ్దాదులను తాను తెలుసుకొనుట యను సర్వవికారములకు స్వరూపము తెలుసుకొనుట- చూచుట, వినుట మొదలగు క్రియలన్నియు తనవికారములే గదా! వీనియన్నిటికి స్వరూపమేమో తెలుసుకొనుట-

2. అట్లే ఈక్రియలన్నిటికి హేతువులను తెలుసుకొనుట.

3. ఈ క్రియలన్నిటివల్ల తనకుగలుగు ప్రయోజనములు ఇతరజీవులందరిలో ఎవరికెట్టి ప్రయోజనములు గలుగునో తెలుసుకొనుటయను నీమూడును పుష్కలముగా తెలియబడవ లెను.అనగా తానుచూచునపుడు తనకర్తృత్వమెట్టిది?వినునపుడు తన కర్తృత్వమెట్టిది? ఇత్యాది సర్వ కర్తృత్వములకు, స్వరూప హేతు, ప్రయోజనముల నెరుగవలయును.

ఇందొక విశేషమును గమనింపవలయును — కర్త యందలి శబ్దస్పర్శాదులను, కర్త తెలుసుకొనుట సర్వజన విదితము. సజాతీయ వస్తువు సజాతీయవస్తువునే గ్రహించును గాని విజాతీయవస్తువును గ్రహింపలేదు. శబ్దమును శ్రోత్రేంద్రి యమే గ్రహించును గాని మరియొకటి గ్రహింపలేదు. కావున కర్తకును, కర్మకును, సజాతీయత యుండితీరవలయునుగదా! అట్లే రాముడు చెట్టును తెలుసుకొన్నప్పుడుగూడ, చెట్టు యందును, రామునియందును, సజాతీయమగు శబ్దాదులుండి

తీరవలయును, అట్లే జగత్తులో స్థావరములనుగాని జంగమములను గాని ఆకాశ వాయ్వాదులనుగాని అతలాది అధోలోకములను గాని; భువరాది సత్యలోకాంతమగు ఊర్ధ్వలోకములనుగాని, విషయకోటి లేక కర్మకోటిలోచేరు (Objective world) ఏ పదార్థమును (కర్త) తెలుసుకొన్నను, ఈస జాతీయతా నియమము ననుసరించి కర్త, కర్మలు రెంటియందును సమానత్వ మవశ్య ముండితీరవలయును. ఇదియే దేవతయనబడును ఇదియే తెలుసు కొనుట యనుక్రియయొక్క తాత్పర్యము.

అట్లే రాముడను కర్తయు తనదేహము ఇంద్రియములు మనస్సున్నుగూడ కర్మకోటిలోచేరితన తెలివికి గోచరమగుచుం డుట సర్వానుభవ సిద్ధమైనందున, తాను దేహేంద్రియ మనస్సులకంటె విలక్షణుడనియు, అదియే తననిజరూపమనియు, ఈ రెంటికి సజాతీయత ఈ జ్ఞానమేననియు ఋజువగుచున్నది. ఈ సర్వలోకానుభవమే జ్ఞానము లేక వేదముయొక్క ఏకత్వ నిత్యత్వ, అపౌరుషేయత్వ, అనంతత్వ, సత్యత్వ, ఆనంద రూపత్వాదులను ఋజువుచేయుచున్నది.

ఇట్టిస్థితిలో, కర్తయొక్క స్వరూప హేతుప్రయోజన ములను పూర్తిగా తెలుసుకొనుటకు, కర్మయొక్కయు క్రియ యొక్కయు స్వరూపాదుల నవశ్యము తెలుసుకొనతీరవలయును అనుట యుక్తియుక్తమేగదా. కావుననే మూడు వేదభాగము లున్ను సమిష్టిప్రయోజన మిచ్చునవి.

ఈ జ్ఞానరూపమగు సాజాత్యమే వ్యవహారము కొరకు, అనగా సులభముగా గుర్తించుట కొరకు "దేవత" అనుసం

జ్ఞానోపాసమన్నది కర్తయందలి శబ్దమును, కర్మయందలి శబ్దమును సజాతీయతతో స్ఫురింపజేయుటయను క్రియారూపము ద్వారా ఐక్యమొందుటయే ఈ వేదత్రయార్థము. ఇది కర్త, కర్మ, క్రియలను మూటిని కలిపి ఏకాకార జ్ఞానవృత్తిని కలుగజేయుటలో కృతార్థమగుచు. ఇట్టి శబ్దసాజాత్యశక్తి ఒక దేవత-స్పర్శసాజాత్యశక్తి మరియొక దేవత - రూపరసగంధవచన ఆదాన గమన విసర్గ ఆనందాది సాజాత్యశక్తులాయా దేవతలు. వీరే ఇంద్రియములనుచు అగ్ని విష్ణు ఇంద్రాది అస్వర్షసంజ్ఞలతో నొప్పుచున్నారు.

కావుననే, కర్త కర్మ క్రియలు మూడును భిన్న భిన్న దేశకాలాదులలోనుండుచో ఎట్టి జ్ఞానమును కలుగనేరదనుట యుక్త్యనుభవసిద్ధమైనందున కేవలఋగ్వేదము, కేవలయజుర్వేదము, కేవలసామవేదము భిన్న భిన్న దేశకాలాదులలో నున్నచో ఎట్టి ప్రయోజనకారులు గానేరవు. ఈ మూడు కలసిననే, ఏ ప్రయోజనమైనను ఘటించును. జ్ఞానముయొక్క మూడు స్థాయిలలోను ఈ వేదత్రయ నియతసాహచర్యము నిత్యం తావశ్యకము. జ్ఞానముయొక్క పరమావధియగు "ఆత్మ" రూపములో మాత్రము ఎట్టిసాధనాపేక్షయు లేదు.

అథర్వవేదమనునది, పై వేదత్రయములో మానసికముగా ఉచ్చరింపవగిన భాగములుమాత్రమేగాని, స్వతంత్రమైన భాగముగాదు. సర్వయాగములందును బ్రహ్మయను సంజ్ఞగల ఋత్విక్కు, ఇట్లుచ్చరించును.-ఒక జ్ఞానక్రియలోని కర్త ఇంకొకదానిలో కర్మయగుటయు, అట్లే ఒకజ్ఞానక్రియ

లోని కర్మ, ఇంకొకదానిలో కర్తయగుటయు సర్వానుభవసిద్ధముగాన, కర్త, కర్మలను బోధించు ఋక్సామవేదములు గ్రంథములలో ఏకరీతిగానుండును. అనగా ఋగ్వేదమే గానమొనర్పబడినపుడు సామవేదమను సంజ్ఞనొందును. (శాబరభాష్యం)

## వేదప్రయోజనము

స్వర్గము, అపవర్గము, అనునవాంతర భేదములుగలసుఖమే వేదప్రయోజనము.

మూడు స్థాయిలలోనుండు తెలివియే తనకనునగు దేహాదికము నేర్పరచుకొనునని లోగడ చెప్పబడినది. ఇది సమగ్రముగాని కారణముచేతనే, తానుసత్యరూపము, జ్ఞానరూపము, ఆనందరూపము, అనంతరూపముఅని గుర్తింపలేక, అసత్యరూపము, జడరూపము, దుఃఖరూపము, పరిచ్ఛిన్నరూపమున్ను అగు దేహాదికమే తానను తలంపుతో జీవుడు వ్యవహరించును. ఒకపుడు దేహమే తానని, మరియొకపుడు చక్షురాదీంద్రియమే తానని, ఇట్లుతలచుచు, ఆనందము తనస్వరూపమే యనియెరుగక, ఎచ్చటనో ఉన్నదని తలచి అందులకై ప్రవర్తించును. అచట తానుతలచిన ఆనందము లభింపకపోవుటచే మరియొక విషయమును గోరును. ఇట్లుగోరుచు, అనుభవింపుచు, అనుభవించు సమయములోగూడ తిరిగికోరుచు ప్రవర్తించును.

దేహధారులందరియొక్క ప్రవర్తన లన్నిటియందును అతడొక ప్రయోజనమును మాత్రమే అపేక్షించినను, వాని

తెలివియొక్క స్వభావబలముచే నాతనికి ప్రవర్తనచే ఏడు విధములగు ప్రయోజనములు ఘటిల్లును. వేదవేత్తకు ఆ ఏడును తెలియును. అజ్ఞునకు తెలియదు. ఇట్లొక జీవుడీజన్మలోకాని ప్రవర్తించిన వృత్తాంతము ఈ జన్మలోని అనుభవములకు మాత్రమే గాక ఉత్తరజన్మలోని అనుభవమునకుగూడ నిమిత్తమగును. వంశానుగత "అదృష్ట"ముగూడ ప్రతివాని అనుభవమునకు నిమిత్తమగును. ఎట్లనగా ఒకడు మరణింపగానే, ఆతని ఆస్తి కుమారులకు సంక్రమించుటయు, ఈ రీతిగా కొన్ని తరముల వరకు ఆ ఆస్తి అనువృత్తమగుటయు లోకసిద్ధమైనట్లే, ఒక జీవుని కోరికలుగాని ప్రవర్తనలుగాని, ఒకానొకరూపములో నుండి, అతని వంశమందు ఏడుతరములవరకు అనువర్తించును. 1. ఇష, 2. ఊర్జ, 3. వ్రత, 4. మయోభువ, 5. వసు, 6. ఋతు 7. హోత్రా అనునేడును వీటికి సార్థకములగు వైదికసంజ్ఞలు.

ఒకనికి "ఇష"ముద్వారా తండ్రితోను, "ఊర్జ"ము ద్వారా తాతతోను, "వ్రత"ముద్వారా ముత్తాతతోను, ఈ రీతిగా, తనవంశములోని, పైవారేడుగురుతో సంబంధముండును. ఇట్లే తన కుమారులు మొదలగు తరువాత సంతతి వారితో గూడ సంబంధముండును. కావుననే ప్రతివాడును పుష్కలముగా మృతుడుగాలేడనియు, పుత్రాదిరూపములతో నున్నాడనియు, ఐతరేయ బృహదారణ్యాదు లుపదేశింపుచున్నవి.

ఇట్లనేక జన్మలలో తన ప్రవర్తనలున్ను వంశానుగత "అదృష్ట" మున్ను కలసి ప్రతివానికిన్ని దేహానుభవాదులకు నిమిత్తమగుచున్నది. ఇందు సుఖదుఃఖములు రెంటికిని బీజము

లుండునుగాన దీనిననుసరించి ప్రతివానికిని సుఖ దుఃఖములు గల్గుచుండును. ఇది ఒకప్పుడు చేయబడినదిగాన కర్మయనియు, అనుభవమునకు పూర్వము కనబడదుగాన "అదృష్ట" మనియు పరిభాషింపబడినది ఇది రెండువిధములు:— 1. పరిణమించి నదిగాన "ప్రారబ్ధ" మనబడును. 2. పరిణామమునొందుచున్నది గాన సంచితమనబడును. ఇందు ప్రారబ్ధమీ దేహమున్న, దీని అనుభవములున్న, సంచితము ముందురాబోవు జన్మలకు అందలి అనుభవములకు పనికివచ్చు "బీజరూపము"

ఈ కర్మ ప్రాబల్య దౌర్బల్యములనుబట్టియు పరిణామ కాల భేదమునుబట్టియు మూడువిధములుగ నున్నను, ఆజీవుని ఆశ్రయించియేయుండును. వాతపిత్తశ్లేష్మముల హెచ్చుతగ్గులచే గల్గు సుఖదుఃఖములు, కామక్రోధాదులచేతను శమ దమాదులచేతనుగల్గు సుఖదుఃఖములు, పదార్థములను పూర్తిగను సరిగాను గుర్తింపక పోవుట ఇత్యాదులన్నియు ఈ కర్మరూపములే గాన వీటిని క్రమముగా పోగొట్టుట వేదప్రయోజనములలో నొకటి. ఇట్టి వేదభాగము "కర్మకాండ" యనబడును. ఈప్రయోజనమునకే "స్వర్గ" మనిసంజ్ఞ. స్వర్గశబ్దమునకు సుఖమనియర్థము. చీమ, గరికె మొదలగు సర్వప్రాణికోటికి సుఖవాంఛ స్వభావసిద్ధము. కోరిన సుఖము లభించినతరువాత అంతకంటె నధిక సుఖమును కోరును. ఇట్లు తరతమ భావముతోనొప్పు ఉత్తరోత్తరోత్కృష్టమగు సుఖమే "స్వర్గము" (శాబరభాష్యం) అట్టి సుఖభేదములన్నిటికి సాధనములే వేదబోధలు. ఎట్టిసుఖమును గోరి తత్సాధనము ననుష్ఠించునో అట్టిసుఖ మాతనికీజన్మలోను

ఇతరజన్మలలోను లభించును. ఈ సుఖములలో పిపీలికాది,సార్వ
భౌమాంత సుఖభేదము సర్వలోకప్రత్యక్షము. ఇక నాముష్మిక
సుఖములన్నియు వేదము బోధించుచున్నది. యౌవనములోనుండి
సర్వవిద్యాపారంగతుడై ధనధాన్యసమృద్ధముగు సమస్తభూమం
డలమును పాలించు సార్వభౌముని యానందమే మానుషానంద
మనును. దీనికి నూరురెట్లుగొప్పది మనుష్యగంధర్వానందము. ఇట్లు
త్తరోత్తర శతగుణోత్కృష్టములు, దేవగంధర్వానంద, పితౄణాం
చిరలోక లోకానంద, ఆజాన దేవానంద, కర్మదేవానంద, ఇంద్రా
నంద, బృహస్పత్యానంద, ప్రజాపత్యానంద, బ్రహ్మానందములు
(తైత్తిరీ 9) వీటికన్నిటికి సాధనములే వేదము. పైకారణము
చేతనే ఈ కర్మలు మూడుతరగతులలో నుండును. 1. పాక
యజ్ఞములు 2. హవిర్యాగములు. 3. సోమసంస్థలుఅని వాటి
పేర్లు. ఇందొక్కొక్కటి ఏడుస్థాయిలలో నుండును.

1ఔపాసన, 2. స్థాలీపాకం, 3. వైశ్వదేవం, 4. అష్టకా
5 మాసిశ్రాద్ధం, 6.సర్పబలి, 7. ఈశానబలియనునవి పాక
యజ్ఞములనబడును. 1. అగ్నిహోత్రం, 2. దర్శపూర్ణమాసలు
3. ఆగ్రయణం, 4. చాతుర్మాస్యలు, 5. పిండపితృయజ్ఞం
6. నిరూఢపశుబంధం, 7. సౌత్రామణియనునవి హవిర్యాగ
ములనబడును. 1. అగ్నిష్టోమము,2.అత్యగ్నిష్టోమము, 3. ఉక్థ్య
4. అతిరాత్రం 5. ఆప్తోర్యామం, 6. వాజపేయం, 7. పౌండరీ
కములనునవి సోమసంస్థలనబడును.

ఈ కర్మలందు పై ఋగ్యజుస్సామలను వేదత్రయము
అవశ్యముండి తీరవలయును. ఏ ఒక వేదముతోను పూర్తిగా

నెరవేర్పబడదు. ప్రయోగకాలమందు, కొన్ని యజుర్మంత్రములును తత్పైని కొన్ని ఋఙ్మంత్రములును, ఆపైని గొన్ని యజుర్మంత్రములు, కొన్ని సామమంత్రములు, ఈ రీతిగా అన్యోన్యసంస్థితో ఈ వేదత్రయము వినియోగింపబడును. దీనికుపపత్తి కర్తృ, కర్మ, క్రియాజ్ఞానముల వివరణవద్దనే చెప్పబడినది. కాత్యాయన ఆపస్తంబాది కల్పసూత్రకారులందరును "యజ్ఞం వ్యాఖ్యాస్యామః, స త్రిభిర్వేదైర్విధీయతే, ఋగ్వేదేన హోతా కరోతి, యజుర్వేదేనాధ్వర్యుః, సామవేదేనోద్గాతా" ఇత్యాదిగా స్మరించిరి.

త్రివిధమగు అదృష్టములేక సంచితమును ఈ కర్మకాండ ఎట్లు పోగొట్టునో విచారింతము – పాపము సంపాదించినప్పుడెట్టి అపచారము నిమిత్తమాయెనో, దాని ప్రతీకారమే పాపనివృత్తి ఉపాయమై తీరవలెను. ఈ జన్మలో ఇతరులకెట్టి ఉపకారమొనర్చినను అన్యజన్మలలో ఈతనికుపకారమే జరుగును. అట్లే ఈ జన్మలో ఇతరులకెట్టి అపకారమొనర్చినను, అన్యజన్మలలో తనకపకారమే జరుగుననుటయే సర్వసాధారణపుణ్యపాపకర్మనియమము–

దీనినిబట్టి స్వలాభముకొరకు ఇతరులను పీడించుటయే పాపమని తేలినది. దీని వివరింతము – వెనుక దేవతలనగా, కర్త, కర్మలిద్దరిలోను ఉన్న శబ్దాదులను కలుపు సజాతీయ శక్తియనుజ్ఞాన భాగమని వివరించితిమిగదా! అనగా రాముడు గ్రామమునుగూర్చి వెళ్ళుచున్నాడు" అనువాక్యమందు రామగ్రామములను రెంటిని కలుపు క్రియయే వెళ్ళుట – ఇందు

రాము గ్రామములలోని సజాతీయతను ఈ క్రియ అనుసంధాన మొనర్చు, కర్త, కర్మ, క్రియలను మూటిని ఏకాకారము నొందించునది. ఇట్టు భాషలో ఎన్ని క్రియాపదములు గలవో అన్ని సజాతీయశక్తులను సంధానరూపజ్ఞాన విశేషములుండి తీరవలెను. ఇవియే ఇంద్రాది దేవతలు. ఏ క్రియాకాలమందు ఈ దేవతయే తన స్వరూపమై కర్త్రాది త్రిపుటీభేదము లేక ఏకాకారమగుటయే వాస్తవికసత్త - దీనికర్త్రాదిత్రయ వ్యక్త్యైక స్వరూపాది జ్ఞానమెట్లు తానొక్కటైయుండున, ఋగాది వేద త్రయమును ఒకేకాలమందుండి తీరవలెను. ఇందేయొక వేదము వల్లను పృథక్ప్రయోజనము సమగ్రముగాదు -

ఇట్టి వాస్తవికతను గుర్తింపలేకపోవుటయే అవిద్య, పాపము ఇత్యాదిపదములచే చెప్పబడును. దీనిచేత నొకపదార్థము ననుభవించుకాలమందు, తాను, పదార్థము, అనుభవించుట యను త్రిపుటీజ్ఞానమేయుండుట, పదార్థమందు, ఇచ్ఛా రాగ లోభ మోహాదులుండుట, ఇత్యాది సర్వలోకానుభవసిద్ధమై యుండున. ఇదియే పాపము - ఇందుకు ప్రతిఫలమును జన్మాంతర మందీతడనుభవించి తీరవలయును

ఇట్టిపాపము దేవతా స్వరూపమును సరిగా గుర్తింపక పోవుటచే గల్గినది గాన, దేవతారాధనమే దీని నివృత్తికి ఉపాయము కావున పాపక్షయము వేదప్రయోజనములలో నొకటి - జ్ఞానమెట్లు స్థూలసూక్ష్మ కారణములను మూడుస్థాయిలలో నుండునో అట్లే ఈ పాపముగూడ మూడుస్థాయిలలో నుండును. రోగాది రూపములతో స్థూలదేహమును, కామక్రోధాది రూప

ముతో సూక్ష్మదేహమును, తెలుసుకొనలేక పోవుట రూపముతో కారణదేహమును, ఆశ్రయించియుండును. స్థూల దృష్టితో బాలబోధకొరకు, ఈ త్రివిధపాపనివృత్తికుపాయ బోధనతో క్రమముగా పాకయజ్ఞ, హవిర్యాగ, సోమసంస్థలను కర్మభేదములని గ్రహింపవలెను– ముందు వీటివివరణ తెలియబడును.

మరల ఈ పాపము ప్రత్యేకముగా, మూడువిధములు:–

---

అనేకజన్మలలో తా నార్జించినపాపము. ఇది అసత్యవదనము ఇంద్రియ చాపల్యము, కామము, క్రోధము, ఇత్యాదిరూపములతో పరిణమించుచూ ఇతనెన్ని జన్మలెత్తినను అనుగతమగుచుండును. ఇట్లొక జన్మలోని పాపము రూపాంతరముల నొందుటయే "ఋషి" శబ్దార్థము గాన ఒకడార్జించిన పాపములన్నిటికి అనుభవబాధ్యత నా తనిపై యుండుట న్యాయమేగదా! దీనికే ఋషిఋణమని సంజ్ఞ – (నిరుక్తము)

2. తనతండ్రి, తాత మొదలగు వంశక్రమానుగతమగు పాపము. ఇదికూడ వీని దేహాశ్రయము నాశ్రయించియే యుండును. దీని ననుభవించుబాధ్యతకూడ ఇతనిపైనుండును. దీనికే పితృఋణమని సంజ్ఞ – ఇట్టి పాపము జీవునిచే ననుభవింపబడు వ్రీహ్యాది సమస్త పదార్థములందును, ఇతనికి రోగ, లోభాద్యరిష్టములను కలుగజేయు దుష్టశక్తి రూపముతో నుండును. (తైత్తి బ్రా 2–1)

3. పై రెండువిధములగు పాపమున్ను, దేవతాస్వరూపమును తెలియక పోవుటచేతనే ఏర్పడినది గాన, ఏయే దేవ

తలకవచాదులొనర్చెనో, తథా దేవతల నారాధించుటయే ఇంద్రియములకు ప్రతీకారము - దేవతయనగా కర్త, కర్మలు, రెంటికి సజాతీయ సంబంధమును సమకూర్చు క్రియాశక్తియేననియు జ్ఞానాపాంతర రూపమేననియు చెప్పితిమి. ఇట్టి శక్తులెన్ని భేదములతో నున్నవో అన్ని దేవత లుండుటయు, జ్ఞానరూపముచే నిందరకును ఏకత్వమును న్యాయమే కదా! కావుననే ఈ క్రియాశక్తులు సర్వజీవులందును భాసించుచున్నందున ఇంద్రాది దేవతలందరును సర్వవ్యాపకులే.

ఇట్టి స్థితిలో ప్రతివానియందును ప్రతి క్రియాశక్తియందును పరిచ్ఛిన్నత ప్రత్యక్షముగా గోచరమగుచుండుటయే ఈ మూడవపాపము, అందుచేతనే, దర్శన శ్రవణాది సర్వ క్రియలందును కొంతపరిమాత్రమే శక్తి, పరిచ్ఛిన్నమగుచున్నది. ఇదియు జీవభేదముచే భిన్నముగనున్నది. మనుష్యులకంటె గృధ్రములకు దర్శన శక్తి హెచ్చుగానుండుటయు, సర్పములకు శ్రవణశక్తి హెచ్చుగానుండుటయు సార్వజనీనము- ఈ మూడవపాపము, పైరెండువిధములగు ద్వారములతో నీతని నాశ్రయించియున్నందున, తడను భవబాధ్యత నీతనిపైగలదు. ఇదియే "దేవఋణ"మను సంజ్ఞతో నున్నది.

కావుననే పైరెండు ఋణములను తీర్చుటకొరకైన ప్రవృత్తికంటె ఈ ఋణప్రతీకారము ఎక్కువప్రక్రియతో గూడియున్నది. వేదముయొక్క అధ్యయనము బోధకొరకును, బోధితాచరణకొరకున్ను యనునూ త్రిగూడ దీనిపోద్బలకము- ఇట్లు ప్రతివాడును ఈ మూడుఋణములచే గ్రస్తుడైయున్నాడు.

లేక ప్రతివాడును స్వస్వరూపమును గుర్తించుటకు మూడు పాపములు అడ్డుపడియున్నవి. (తైత్తి సం. 6-3) ఈ త్రివిధ పాపనివృత్తికరమైనదే వేదములోని "కర్మకాండ". దీని ననేక జన్మలలో నాచరించినవారికే చివరిజన్మలో నిత్యానిత్యవస్తు వివేకము, ఇహాముత్రార్థఫల భోగవిరాగము, శమదమాది సాధనసంపద, ముముక్షుత్వములను సాధనచతుష్టయము సంపత్తి గల్గి, అశేషవేదముయొక్క పుష్కల తాత్పర్యమగు జ్ఞాన పరమానందమునొందును. అట్టివానికి ఋణత్రయాపాకరణాది కర్మ కలాపమంతయు గతజన్మలలోనే పూర్తియైయుండును, ఆజన్మలో నియత కర్తవ్యముగాదు. ఇకనీమూడు ఋణములను తీర్చుటకుపాయమగు కర్మకాండను కొంతవివరముగా తెలిసి కొందము.

## ఋషి ఋణ ప్రతీకారము

ఒకప్పుడొనర్చిన పరాపకార హింసాది పాపమును, ఆతనికి రోగ, రాగద్వేషాది రూపమునొందునట్లు పరిణమించుటయే ఈ దోషస్వరూపముగాన తత్ప్రతీకారమిందుకు తగినట్లుగా నేయుండి తీరవలయును. ఇతరులందు దోషదృష్టి, ఇంద్రియచాపల్యము పెద్దలందు తిరస్కారభావము, అసుచిత్వము, గర్వము, దంభము, అస్థిరత్వము, అసత్యవదనము ఆహార పదార్థములలో కొన్నిటియందు ప్రేమ, మరికొన్నిటియందు ద్వేషము ఇత్యాదులీ దోషనిదానములుగాన తత్ప్రతీకారములిందుకు విరుద్ధముగా నుండుట న్యాయమేగదా! కావుననే

అంతరియము డు మంచిదృష్టి, మనస్సును ఇంద్రియములను చాపల్యములేక ఏకాగ్రత గల్గియుండుట, పెద్దలందు గౌరవ భావము, శౌచవిధిని పాటించుకొనుట, వినయము, దంభదర్పా దులులేకుండుట, స్థైర్యము, సత్యవచనము. సమస్తాహారపదార్థ ములందు ఏకరీతి యగుదృష్టి ఇత్యాది బ్రహ్మచారిధర్మము లన్నియు. ఋషిఋణప్రతీకారములు — స్వగృహమందు తల్లి దండ్రుల సమక్షములో నున్నయెడల పై ధర్మము లలవడుట కవకాశము లేదు. ముఖ్యముగా సర్వాహారపదార్థములందును రాగద్వేషరహిత సమదృష్టి ఎంతమాత్రము కలుగనేరదు. తనకభిమతపదార్థముల నేకోరి, తల్లిద్వారా లభింపజేసుకొనును. అనభిమత పదార్థములందలి ద్వేషమట్లే యుండుటయేగాక ఇంకను పెరుగును. గావుననే సమస్త భూమండలాధిపతియగు చక్రవర్తికుమారుడైనను, గురుకులవాస మొనర్చితీరవలయును. ఇట్లీ ఋషిఋణ పరిజ్ఞానముగాని, దాని ప్రతీకారముగాని, కర్త, కర్మ, క్రియాభేదభిన్నమైనట్టి ఋగ్యజుస్సామములను త్రివిధవేద పరిజ్ఞానముచేతనే ఇది సమగ్రమగును. ఏకాల మందైనను ఒకఋగ్వేదము మాత్రమేయుండి ఇతరవేదము లేకున్నచో, ఈ ఋషిఋణముగాని తత్ప్రతిక్రియగాని పూర్తిగాదు.

## పితృఋణప్రతీకారము:

తనవంశమందు ఏడుతరములవరకు గల అన్యోన్య సంబంధము లోగడ చెప్పబడినది. ఇదియే జాతాశౌచ మృతా

శౌచములనుగూడ ఉపపత్తియగుచున్నది. ప్రతిమానవుడు తనజీవితకాలములో పైమూడువిధములగు ఋణములను పోగొట్టుకొనుటకు శాస్త్రీయమగు ప్రయత్నమొనర్చుచు, కొంతవరకు మాత్రమే కృతార్థుడై యుండగా దేహత్యాగ మాసన్నమగుచో, నాతడు తన కుమారునియందు తానొనర్చిన శాస్త్రీయ ప్రయత్నమును, తత్ఫలమును సంక్రమింపజేయును – ఇదియే "సంప్రత్తి కర్మ" యనబడును. అట్టి కుమారుడా యప్రయత్నాదులను పూరించి తండ్రిని కాపాడవలయును. అప్పుడే "పుత్రుడు" నను సంజ్ఞ సార్థకమగును. (బృహ 1) ఇందు మొదటిది ఆతండ్రి జీవితకాలములో ఏయే దేవతనుపాసించెనో, ఆ ఉపాస్య దేవత యందా తండ్రి దేహమును లయింపజేయుటయే – వేదమును పరమ ప్రమాణముగా విశ్వసించు వారందరును, ఏ దేవతను పాసించినను అగ్నిద్వారాగానే ఆరాధింతురుగాన అట్టి ఉపాస్య దేవతారూపమగు అగ్నిలోనే యాతని దేహము లయింపనగును – (తైత్తి ఆర) ఇదియే దహన సంస్కారమనబడును.

ఇట్టి దహన సంస్కారమున కధికారములేని గర్భస్రావములు, అనుపనీతులు, జాతిభ్రష్టులు, మారీవిషూచ్యాదిదుర్మృతులు, ఇత్యాదులకీ యోగ్యతలోపించును. గాని వెనుక జెప్పిన ఇష ఊర్జాదులద్వారా ఈ దోషము తద్వంశీయులనాశ్రయించి యుండును – దీని నివృత్త్యుపాయమే "పిండ పితృయజ్ఞ"మనబడును ఇట్టి అగ్ని దేవతోపాసన అధమ, మధ్యమ ఉత్తమాధికారభేదముచే మూడువిధములుగ నుండును. కావుననే ఉపాస్య దేవతాలయమగు దహన సంస్కారమందలి మంత్రకలాపము

కూడ సూత్రవిధములు (భారద్వాజకల్ప సూత్రము) ఇందు కూడ ఋగ్యజుస్సామలను వేదత్రయము అవశ్యముగా నుండితీరవలయునేగాని ఏ ఒక వేదముచేతను దహనసంస్కారము పూర్తిగాదు.

ఇట్లే ఇచట జీవితకాలమును వేదయజనముతో గడిపి మరణించినవారు "బర్హిషదు"లనబడుదురు. ఇచట యాగాదుల నాచరింపక మరణించినవారు "అగ్నిష్వాత్తు"లనబడుదురు. ఇవిసార్థక నామములే (తైత్తి బ్రా-3) ఇట్లీలోకములో వారు ప్రవర్తించినరీతినిబట్టి వారుభిన్నభిన్నములగు ఊర్ధ్వాధో లోకములలో జన్మలెత్తుదురు. అచట వారికనువగు నుపకారము, తద్వంశీయులద్వారా లభించవలెను. ఇట్లేమతరముల నరకము నొందరో భిన్నములగు పుణ్యపాప ఉపాధులలోనుండి సహాయమపేక్షించుటచేతనే తదుపాయములుగూడ అనేక తరతమ భేదములతో నొప్పితీరవలయును. ఇవియే, నిత్యపితృతర్పణము, అగ్నిహోత్ర, దర్శపూర్ణిమాస, అగ్నిష్టోమాది సర్వయాగములందును పితృభాగములు, చాతుర్మాస్యలన సావిత్ర్యాగమందు మహాపితృయజ్ఞము, వివాహాది శుభకార్యములందు నాందీశ్రాద్ధములును పాకయజ్ఞములు, వైశ్వదేవమందు పితృభాగము, ఇత్యాదులు—కావుననే ప్రతి దేవయాగమందును పితరులకవశ్యము భాగమిచ్చితీరవలయును (తైత్తి బ్రా 2-1) ఇదిపితృఋణమునుతీర్చునుపాయము.

## దేవఋణప్రతీకారము

కర్త, కర్మ, క్రియలను మూటిని కలిపి ఏకాకారము నొందించు జ్ఞానభాగమే దేవతలని లోగడ చెప్పబడినది. కర్త్రాదిభేదములనేకములు గాన దేవతలుకూడ అనేకులు — వీరి యపచారమే ఈ పాపము అనగా ఏకాకారమును గుర్తింపక కర్త, కర్మ, క్రియలు భిన్నములని తలచుటయే — అందుచే దీని ప్రతీకారము ఈ మూటియొక్క — ఐక్యజ్ఞానమే — ఇందుకు నిదర్శనముగా అగ్నిహోత్రాది సర్వయాగ మంత్రములందున్ను, తనయొక్క దేహేంద్రియాదులందును, ఓషధ్యాది సర్వయాగోపకరణములందును, సర్వక్రియలందును, ఆయా దేవతా దృష్టిని బోధించుట స్పష్టముగా గోచరించుచున్నది. కావున దేవతలనుద్దేశించి తనసర్వస్వమును త్యాగమొనర్చుటయే దేవఋణప్రతీకారము.

పూర్వజన్మలందు తానొనర్చిన దేవతాపచారమే ఈ జన్మలో తన దేహేంద్రియ, భోగ్యవస్తురూపములో "ప్రారబ్ధ" మైనది గాన, తన్నివృత్తియే దేవఋణప్రతీకారము, దేవతాపచారము, కర్త కర్మ క్రియల నాశ్రయించియున్నందున, ఈ దోషముకూడ త్రివిధము. అందు కర్తృగత దోషము తన దేహేంద్రియాశ్రయమై యున్నది. కర్మగత దోషము, తన భోగ్యవస్త్వాశ్రయమై యున్నది – క్రియాగత దోషము, చూచుట వినుట నడచుట మొదలగు తన సర్వక్రియాశ్రయమై యున్నది. అనగా కర్తృదోషము ఈజన్మలోగాని జన్మాంతర

మందుగానితెన దే హేంద్రియములద్వారాను, కర్మగతదోషము తన భోగ్యవస్తువుల ద్వారాను, క్రియాగతదోషము, తనసర్వ క్రియలద్వారాను అనుభవింపదగియున్నది – ఈ త్రివిధ దోష ములను, దేవతలయందు లయమొనర్చుట వేదముల ప్రతీకార ఉనుట యుక్తి యుక్తమేగదా!

లోకమందు గుణముగాని క్రియగాని స్వస్వరూపముచే గోచరముగాక ద్రవ్యాశ్రయముచే గోచరించును. రూపాది గుణము మొదలగు ద్రవ్యాశ్రయము లేకుండగా కేవల తెలు పును చూడలేముగదా! పురుషాద్యాశ్రయము లేని కేవలగ మనక్రియను చూడలేమనుట సార్వజనీనము. అట్లే ఈ త్రివిధ దోషములుగాని దేవతలుగానిస్వస్వరూపముచేగోచరముగావు. అటిస్థితిలోపీటిని దేవతోద్దేశ్యముగా త్యాగ మొనర్చుట ఎట్లు? ఇందుల కుపాయమునుగూడ వేదమే యుపదేశించినది.

ఇందుకర్తృ దోషములన్నియు ఇంద్రియాశ్రయములు గాన వాటికి ప్రతినిధులను, కర్మదోషములన్నియు భోగ్య వస్త్వాశ్రయముగాన వాటికి ప్రతినిధులను, క్రియా దోషములన్నియు, తనయందలి క్రియలనాశ్రయించి యున్నందున వాటికిప్రతినిధులనువేదముపదేశించినది ఇంద్రియ ప్రతినిధులుస్రుక్కము, కపాలములు, అగ్నిహోత్ర హావణి, జుహూ, ఉపభృత్తు, ధ్రువాస్రువము, మొదలగు యజ్ఞాయుధములు, ఇందుజుహూ దక్షిణహస్తమునకు, ఉప భృత్తువామహస్తమునకు ఇత్యాదిగా సకలావయవములకును ప్రతినిధులుగలవు. ఈ యింద్రియములద్వారా అనుభవింప

జగిన కర్తృదోషములున్నయు, ఈ యజ్ఞాయుధములలోని కాకర్షింపబడి దేవతార్పణ గావింపబడుచుండును. ఇట్లనేక మానవులొనర్చిన కొలదియు, ఇతనికి దోషములు తగ్గుచుండుట న్యాయమేగదా! కావుననే ఈ యజ్ఞాయుధములు "యావజ్జీవపాత్రి"లను అన్వర్థ సంజ్ఞ కలవియై, ఆ యజమాని దేహత్యాగ కాలమందు, ఆయాపాత్రి లాయా దేహావయవము లందుంచబడి యజమాన దేహము దహన సంస్కారము నొందును.

ఇక కర్మదోషముల కాశ్రయమగు భోగ్యవస్తువుల కన్నిటికి ప్రతినిధులు "హవిస్సు" లేక హోమద్రవ్యములు – ఇది "దైవవిత్తము" మానుషవిత్తము అని రెండు విధములు. అందు శ్రోత్రేంద్రియ మాత్రముచే నుపభోగ్యమునకు "దైవవిత్త"మనియు, మిగిలిన సకలేంద్రియోపభోగ్యమునకు "మానుషవిత్త" మనియు సంజ్ఞలు – చక్షురాదీంద్రియము లన్నియు ఇహలోకమాత్రగోచరములనియు, ఒక శ్రోత్రేంద్రియము మాత్రము, అతలాద్యధోలోకములను, భువరాద్యూర్ధ్వ లోకములనుగూడ గోచరమొనర్చుకొనుటయు సర్వలోకానుభవసిద్ధమేగదా! (బృహ) యాగానుష్ఠాన కాలిక సర్వవేద మంత్రములే ఈ దైవవిత్తము. గావుననే దీనికి "శ్రుతు"లను సార్థకసంజ్ఞ – ఇకమానుషవిత్తము చక్షురాద్యనేకేంద్రియ భోగ్యమైనందున అనేకవిధములు ఇవియే, పయస్సు, దధి ఆజ్యము, ఆమిక్ష, వాజినము, వృషదాజ్యము, ధాన, కరంభ, సక్తు, చరు, పురోడాశ, పాశుకహృదయ

జిహ్వాస్యప్రదాన, వపాదులు – ఈ ప్రతిసిద్ధులలోనికి, పీనసర్వ కర్మగతదోషములున్నువేద“శ్రుతి” సామర్థ్యముచే నాకర్షింప బడి దేవతోద్దేశ్యకముగా త్యజింపబడును– ఇవియు ప్రతిసమస్త యాజమానము లేకాన ఒకయజమానునొక్క యాగీయ ద్రవ్యము మరియొకయజమానికి హవిస్సు కానేరదు ఇట్లనేక యజమానులు యాగముల నొనర్చునప్పుడియు, అతని కర్మదోషము బట్టి తగ్గుచుండుట న్యాయమేగదా!

అట్లే క్రియాగత దోషముల కాశ్రయమగు నీతని కర్మ నాది సర్వక్రియలకు ప్రతినిధులే ఋత్విక్కు లనబడుదురు. వీరు నాలుగు గణములు, ఒక్కొక్క గణములో నలుగు రుందురు. అందు 1.అధ్వర్యుడు 2.ప్రతిప్రస్థాత 3. నేష్ట 4.ఉన్నేతలను వారొక గణము. వీరన్ని కర్మలందును యజుర్వేదము నే పఠింతురు. 1 బ్రహ్మ 2. బ్రాహ్మణాచ్ఛంసీ 3. ఆగ్నీధ్రుడు 4. పోతయనువారు రెండవగణము. వీరన్ని కర్మలందును అథర్వవేద (సర్వవేద)ము పఠింతురు. 1. హోత 2. మైత్రావరుణుడు 3. అచ్ఛావాకుడు 4. గ్రావస్తుతులనువారు మూడవ గణము. వీరన్నికర్మలందును ఋగ్వేదము నే పఠింతురు. 1. ఉద్గాత, 2. ప్రస్తోత, 3. ప్రతిహర్త, 4. సుబ్రహ్మణ్యులను వారు నాల్గవ గణము, వీరన్నికర్మలందును సామవేదము నే పఠింతురు. (ఆప స్తంబ 10)

వీరిలో అధ్వర్యుడు ప్రధానుడు మిగిలినవారందరు వాని ననుసరింతురు. ఇవన్నియు అధ్వరసంజ్ఞలు– యజమాని వీరినంద రను ఋత్విక్కులనుగా వరించు సమయమందున్న, యాగ

సమాప్తి కాలములో వీరలకు ఆయా యాగములందు, వేదముచే బోధింపబడిన 112 మొదలగు సంఖ్యగల గోవులను దక్షిణగా సమర్పించు సమయమునందున్న, పఠించు మంత్రములచే, వీరలందరును యజమానియొక్క సర్వక్రియలను, దేవతలకు ప్రతినిధులని స్పష్టపడును. ఇట్లు ఋత్విక్కులు గూడమను, యజమాని యాగమును నిర్వహించుచున్నను, సోమసంస్థలేకాకింటిలోను, తమతము పితృదేవతలకుగూడ యజమాన యాగీయద్రవ్యములోనే పిండప్రదాన మొనర్చుటకూడ వేదబోధితమే యైనందున పైయుపపత్తి బలపడుచున్నది. అఖిల సర్వక్రియాకాండ కాశ్రయమగు యజమాని దేహమునకు ప్రతినిధి "యాగశాల" యనబడును. అందును శిరస్సునకు ప్రతినిధి "హవిర్ధానము" ప్రాణములకు ప్రతినిధులు "ఉపరవములు" హనువులకు ప్రతినిధులు "అధిషవణ ఫలకములు" జిహ్వకు ప్రతినిధి "చర్మ" దంతములకు ప్రతినిధులు "గ్రావలు" ముఖమునకు ప్రతినిధి "ఆహవనీయము" నాసికకు ప్రతినిధి "ఉత్తరవేది" ఉదరమునకు ప్రతినిధి "సదస్సు" (తైత్తి సం)

ఈ విధముగా ప్రతినిధులలోని కాయా దోషముల నాకర్షించుచు త్యాగమొనర్చుటకు, ఉద్దేశ్యముగు "దేవత" స్వరూప మొకింత వివరింపబడును. తనయందలి కర్తృ కర్మ క్రియాభావములకు మూలము తనయొక్క ఆహారపరిణామము. ఆహారము దేహావయవముల కన్నిటికి, తదనురూపముగా ప్రసరించినపుడేగదా సర్వవ్యవహారములు జరుగుట! ఇదియే అగ్ని- దేహమందు అగ్ని యున్నప్పుడే జీవించియున్నాడని లేనపుడు

మరణించెదని ప్రాజ్ఞజీవను - ఇంతేగాక సర్వదేహేంద్రియ వృత్తులను తమ తమ కార్యములకు ఉన్ముఖులుగా నొనర్చునది అగ్నియే - కాన ఈ కర్మకాండ, సర్వదేవతాప్రతినిధిగా అగ్నిని గ్రహించినది -

జ్ఞానమునబట్టి ఈ అగ్నిగూడ మూడుస్థాయిలలో నుండును. ప్రథమస్థాయిలో దీనికి "గృహాగ్ని" లేక "ఏకాగ్ని" లేక "అవసథ్యాగ్ని" అని సంజ్ఞ. ఇట్టిస్థాయిలోనున్న అధికారి, ఈఅగ్నియందా యా దేవతల నుద్దేశించి స్వద్రవ్యమును త్యాగ మొనర్చు ప్రక్రియా విశేషములే "పాకయజ్ఞము"లనబడును. ఇక ఈ అగ్నియొక్క రెండవస్థాయి నొకింతవిచారింతము.

దేహమందలి సర్వప్రవృత్తులకు హేతువగు ఆహార పరిణామము మూడుస్థాయిలలో జరుగును. 1. ముఖము, 2, హృదయము, 3. జఠరము- క్రియాశక్తి రూపజ్ఞానభాగమే దేవతలైనందున వీరు సర్వజీవులందును, ఉన్నందున, తన ప్రవృత్తులన్నియు తనజ్ఞానానురూపములై యుండుటయుక్తమే- దీనికే దేవతల ఆధ్యాత్మిక రూపమనిసంజ్ఞ- ఇందు తనముఖమందు, హృదయమందు, జఠరమందున్న, ఎట్టి పరిణామములు జరుగుచున్నవో ఏయే పరిణామ ప్రక్రియచే తనకు పాపము (దుఃఖము) గల్గునో, ఏయే పరిణామ ప్రక్రియచే తనకుపుణ్యము (సుఖము) గల్గునో, సామాన్యజీవులకు తెలియదుగదా. కాని పుడు దుఃఖము ననుభవించుచున్నందున ఇక ముందు సుఖమును జన్మాంతరములలో సైతము పేక్షించి తత్సాధనముల నాచరింపవలెను. ఇట్టివాడె రెండవస్థాయిలోనున్న అగ్ని నారాధింపనధికారి.

ఈ అగ్ని సర్వదేవతామయుడనుట భావకల్పనామాత్రముగాని అతిశయోక్తిగాని, ఎంతమాత్రముగాక, స్వరూపనిర్ణయమున్న స్వభావోక్తియై యున్నది. ఏలననగా దర్శన స్పర్శనాది క్రియాశేషమైన తద్భావాత్మక దేవతలన్నియు పైముఖ హృదయము జఠరములను స్థానత్రయములో ఏ యొకదానితోను సంబంధములేని స్వతంత్రవ్యక్తులు గాదనుట సార్వజనీనమే. దర్శనాది ప్రతిక్రియలును, ప్రాణసత్తను సంబంధరహితమై యుండుటలేదుగదా! ఇంతేగాక, మననము, చూచుట వినుట మొదలగు నానాక్రియలొనర్చు కాలములో మన దేహమందెట్టి నాడీచలన సంయోగాదులేర్పడు చున్నవో వాటినేగదా ఈ వేదము బోధించునది. ఇది స్వరూప స్వభావ బోధకమే గాని అతిశయోక్తిగాని భావకల్పనగాని ఎట్లగును?

కావుననే ఈ స్థితిలో అగ్నియున్నప్పుడు వసుదేవత, యనియు, ఈస్థితిలో నున్నపుడు రుద్రదేవతయని ఈ రీతిగా కొన్నిస్థితులనుబట్టి కొందరు దేవతలనుబోధించి, చివరకీస్థితిలో నున్నపుడు బ్రహ్మయనువరకు వస్వాదిబ్రహ్మపర్యంత దేవతాభేదములనీ యగ్నిలో గుర్తించు నుపాయమును వేదముపదేశించినది (తైత్తి ఆ॰ 2-1)

ఇంతేగాక అగ్నిలో హోమమొనర్చు సమయమున ఆయా దేవతాధ్యాన మత్యంతావశ్యకమని, అదిలేనిహోమము వ్యర్థమేనని ఛాందోగ్య శ్రుతివలన తెలియుచున్నది. కావుననే యజమాని విద్వాంసుడైనను మానసిక దేవతాధ్యానమునకు, కాయిక వ్యాపారమునకు ఏకతానత్వముకొరకు, తాను

మానసికవ్యాపారమును, ఋత్విక్కులద్వారా కాయిక వాచిక వ్యాపారమును చేయుచున్నాడు.

ఈ ఇంద్రాదిదేవతలు యజ్ఞాగ్నిలో మాత్రమేగాక, తనయందును, సర్వజీవులందును, ఉన్నవారేయను నభిప్రాయము యజమానికి దృఢమగుటకే, ప్రతియాగమందును, 1. అగ్నిలో దేవతోద్దేశ్యక స్వద్రవ్యత్యాగమును, 2. యజమానియందు దేవతోద్దేశ్యక స్వద్రవ్యత్యాగమును 3. ఋత్విక్కులందు దేవతోద్దేశ్యక స్వద్రవ్యత్యాగమును అవశ్యముగా విధింపబడినది. ఇట్లనేకమార్లు ఈ కర్మలనాచరించిన కొలదియు, ఇతనికి తనయందును సర్వభూతములందును వ్యాపించియుండు దేవతాజ్ఞానము అతిశయించి, తద్ద్వారా రాగద్వేషాది దోషములు తగ్గును. ఇదియే చిత్తశుద్ధియని, సుఖమని, స్వర్గమని, ఉపాత్త దురితక్షయమని, ధర్మమని చెప్పబడును. ఇది వేదప్రయోజనములోని పూర్వభాగము. ఇక రెండవ ప్రయోజనమును తెలిసికొందము.

## మోక్షము :

సుఖదుఃఖములు రెండుకలసి 100 మొత్తమైనచో, 1 పాలు పుణ్యము 99 పాళ్ళు పాపముగల జీవులు స్థావరములగుదురు. ఇట్లే 50 పాళ్ళు పుణ్యము, 50 పాళ్ళు పాపము గల జీవులు మనుష్యులు. 99 పాళ్ళు పుణ్యము 1 పాలు పాపము గల జీవులే సత్యలోకవాసులు - ఇట్లు పాపక్షయమైన కొలదియు పుణ్యమతిశయించుటచే నూర్ధ్వలోక ప్రాప్తియుండును. పుణ్యాతిశయమనగా దేవతాజ్ఞానము పెరుగుటయే - కావుననే కర్మ

కొండరో ప్రవృత్తుల దేవతాజ్ఞానమును సంపాదించిన శ్రీకుమారిల భట్టపాదులవంటి ఉత్తమాధికారి, కర్త కర్మ క్రియలకు ప్రతిఘ లగు యజ్ఞాయుధములను, ఆజ్యాది హవిస్సు ఋత్విక్కులను గ్రహించక తనదేహమందు నిశ్చయముగా హవన మొనర్చు కొనును — దీనికే "సర్వస్వార"మని సంజ్ఞ.

ఇట్టివారికి తత్త్వజ్ఞానమే, క్రియాకార కామ్యపేక్ష స్థితిలో ఇంద్రాది దేవతారూపము నొందుననియు, అట్టి అపేక్ష లేనిస్థితిలో కృతకృత్యులైనందున, బ్రహ్మయనియు స్థిరమైన నిత్యసుఖము నొందును. ఇదియే అపవర్గమనబడును. ఇట్టివారు క్రియాకారక ఫలరూప జననమరణాది సంసారబంధమునుండి విముక్తులుగాన దీనికే మోక్షమని సంజ్ఞ — ఇట్టిసుఖము లేక ఆనందమే వేదప్రయోజనము. ఈ సుఖము మనుష్యాది ప్రజాపత్యంతము తరతమ భావములతో నిండి యతిక్రాంచి దోషలేశ సంబంధము గలిగియున్నపుడు "స్వర్గ"మనిగాని, అభ్యుదయమని గాని చెప్పబడును. నిరతిశయమై దుఃఖలేశసంబంధముగూడ లేనపుడు "అపవర్గ"మనిగాని మోక్షమనిగాని చెప్పబడును.

## నిత్యనైమిత్తికకామ్యకర్మలు

ఈ కర్మలు మూడువిధములగు నవాంతరసంజ్ఞలతో నున్నవి. ఇదివరకు ప్రతివానికి త్రివిధదోషములు తప్పకగల వనియు, దేవర్షిపితృఋణత్రయ నివృత్తి తప్పక యొనర్చితీర వలెననియు, అపుడే జ్ఞానము గలుగుననియు సోపపత్తికముగా వివరించబడినది. అందు చేసినవి "నిత్య"ములనబడును. ఇవి చేయని

వాడు స్వభావసిద్ధ దేహేంద్రియ విషయవ్యాపారముచే క్రమ ముగా నధోగతిని బొందుననుటయు యుక్తిగూడ గలదు. ఇతరులకెట్టి అపకారము నొసర్చినను పాపమని లోగడ చెప్ప బడినదిగదా! ప్రతి దేహధారియు ఆహారము నవశ్యము గ్రహించవలెను. ఆహార పదార్థములన్నియు జీవులే గాన ప్రతిదినము తన దేహోపభోగముకొరకు అనేక జీవులను హింసించవలెను. అట్లే ఉదకమందనేక సూక్ష్మజీవులున్నారు. పీల్చుగాలియందున్నారు. కంటిరెప్పవాల్చుటచే ననేక జీవులు నశించుచున్నవి. ఇన్నిటివలన వీనికనర్థ పరంపరగలిగి తీర వలయుననుట యుక్తమేగదా! వాటిని తప్పించుకొనుటకే “నిత్యకర్మ”లుపదేశింపబడినవి.

## కామ్యకర్మలు :

స్వభావసిద్ధముగు దౌర్బల్యముచే మానవులు కొందరు నిత్యకర్మలను విసర్జించి ఆచరింపక పోవచ్చునను తలంపుతో నట్టివారలనుగూడ క్రమముగా నిత్యకర్మల నాచరించునట్లు చేయుట “కామ్యకర్మల” ప్రవృత్తి నిమిత్తము — ఎట్లనగా మానవుడుగూడ తనకైశ్వర్యమును సంతానమును శత్రుజయము నను వర్షమును ఇత్యాదిగా కోరునుగాని అందుల కాతనికి తెలిసిన లౌకికోపాయములవల్ల తనయభిమతము నెరవేరక పోయినతర్వాతనైనను ఈ వేదబోధిత సాధనముల నాచరింప నిచ్ఛగించును. ఇవియే కామ్య కర్మలనబడును — ఇవి కొద్ది మార్పుతో నిత్యకర్మలవలెనే ఆచరింపబడును. గాన ఈ కామ్య

కర్మనాచరించినపుడుగాని, తత్ఫలితము నొందినతరువాతగాని, ఈ వేదమందు విశ్వాసముగల్గి, తదర్థమును క్రమముగా గుర్తించి సుఖించుటకు సాధనమగు చున్నది.

## నైమిత్తిక కర్మలు:

అట్లే పుత్రుడు జన్మించినపుడు, చేయవలసిన కర్మ, గృహము దహనమైనపుడు చేయవలసినకర్మ, ఇత్యాది శుభాశుభనిమిత్తములు తటస్థించినపుడు, తద్వారా తనకు ఐహికాముష్మిక సుఖప్రాప్తికొరకు చేయుక్రియలకు "నైమిత్తికకర్మల"ని సంజ్ఞ – ఎట్లనగా జన్మించిన కుమారుడు 8విధములగు స్థాయిలలో నెద్దానినైనను పొందవచ్చును. అవేవనగా 1. జాతుడు 2. బ్రాహ్మణుడు 3. శ్రోత్రియుడు 4. అనూచానుడు 5. ఋషికల్పుడు 6. భ్రూణుడు 7. ఋషి 8. దేవుడు – అనునవి – ఇందుత్తరోత్తరోత్కృష్టగలదు. పుట్టినకుమారుడు,వాని విద్యా విజ్ఞానాది బలభేదముచే నీయెనిమిది తరగతులలో, నెద్దియొయొక తరగతికి చెందవచ్చును. గాన తండ్రి, తన కుమారుడు దేవుడు కావలయునని కోరుచో, ఆజన్మకాలమందు "జాతేష్టి"యను నైమిత్తిక కర్మనాచరించి అందుతన యభిమత పూరణకుతగు ప్రక్రియనాచరింపవలెను.ఇట్లే'ఋషి'"భ్రూణుడు" ఇత్యాదులలో నెట్టివాడు కావలయునని తండ్రితలచునో అందు కనువగు ప్రక్రియలను ఈ నైమిత్తికయాగ మందాచరింపవలెను (బోధాయన 1-7) ఈ నైమిత్తిక కామ్యకర్మలందుగూడ నిత్యకర్మలందువలెనే ఋగ్యజుస్సామ వేదములన్నియు ఆవశ్యకమే గాని ఏఒక వేదముతోగూడ ఏఒకకర్మయు పూర్తిగాదు.

## మంత్ర బ్రాహ్మణ ఆరణ్యక, ఉపనిషత్తులు:

### మంత్ర బ్రాహ్మణాత్మకమే వేదము:

వెనుక జుహ్వాది యజ్ఞాయుధములు కర్తృప్రతినిధులనియు ఆజ్యాదిహవిస్సులు కర్మప్రతినిధులనియు ఋత్విక్కులు క్రియాప్రతినిధులనియు, అగ్ని సర్వదేవతా ప్రతినిధియనియు తెలుసుకొంటిమి. ఈ ప్రాతినిధ్యజ్ఞానమే "మంత్రము"లనబడును. దోషమును పోగొట్టి జ్ఞానమునభివృద్ధి చేయునదీ ప్రాతినిధ్యజ్ఞానమే-అనగా స్రువముతో ఆజ్యమును గ్రహించి "జుహువు"యందుంచుకొని, ఆహవనీయాగ్నిలో అధ్వర్యుడను ఋత్విక్కు హోమమొనర్చునపుడు, ఆజ్యము తన భోగ్యవస్తు ప్రతినిధియనియు జుహువు తనదక్షిణ హస్తముద్వారా చేయు పనులందలి కర్తృత్వమునకు ప్రతినిధియనియు ఆహవనీయాగ్ని తనముఖమునకు ప్రతినిధియనియు, అధ్వర్యుడు తనదర్శనక్రియకు ప్రతినిధియనియు, ఈ ప్రకారం యజ్ఞప్రయోగకాలిక అర్థమును స్మరించు జ్ఞానవిశేషమే "మంత్ర"మనబడును. ఇదియు, ఋగ్యజుస్సామాథర్వణములను నాల్గు భేదములతో నొప్పియున్నది.

ఈ ప్రాతినిధ్యమునకు హేతువిది, ప్రయోజనమిది, స్వరూపమిది, ఇత్యాద్యుపపత్తులద్వారా ఆ యా మంత్రముల వినియోగ తాత్పర్య దేశకాలాదుల నుపదేశించు భాగము "బ్రాహ్మణ"మనబడును. ఇది ఇతిహాసము, పురాణము, విద్య, ఉపనిషత్తు, శ్లోకము, సూత్రము, అనువ్యాఖ్యానము, వ్యాఖ్యానము అను నెనిమిది అవాంతరభేదములతో నొప్పియున్నది.

"పూర్వమిట్లు జరిగెనట" అనురీతిగా బోధించు బ్రాహ్మణభాగమే "ఇతిహాసము". సృష్ట్యాది ప్రతిపాదక బ్రాహ్మణ భాగమే "పురాణము". ఉపాసనను బోధించు బ్రాహ్మణభాగమే "విద్య". మంత్రప్రయోగ, అనుష్ఠాన, పదార్థాదుల ఉపపత్తిరహస్యములను బోధించు బ్రాహ్మణ భాగమే "ఉపనిషత్తు". బ్రాహ్మణ ప్రభవములగు మంత్రములే "శ్లోకములు." వస్తువునుసూచనా మాత్రముగా సంగ్రహముగా బోధించు బ్రాహ్మణ భాగమే "సూత్రము." మంత్రార్థమును, వినియోగమును బోధించు సూత్రప్రాయార్థమును వివరించు బ్రాహ్మణభాగమే అనువ్యాఖ్యానము - విధేయప్రాశస్త్యమును బోధించు అర్థవాద రూప బ్రాహ్మణ భాగమే "వ్యాఖ్యానము"—

ఈ మంత్ర బ్రాహ్మణములు రెంటిలోను ఆభిచారిక భాగము, పితృమేధభాగము వానప్రస్థులు సంన్యాసులు ముఖ్యాధికారులుగా గల భాగమున్ను "ఆరణ్యక" మనబడును. కావున మంత్రబ్రాహ్మణాత్మకమే వేదము.

ఈ మంత్ర బ్రాహ్మణములు రెండున్ను 1 హేతురూపము 2 నిర్వచనరూపము 3 నిందారూపము 4 ప్రశంసారూపము 5 సంశయరూపము 6 విధి రూపము 7 పరక్రియారూపము 8 పురాకల్పరూపము 9 వ్యవధారణకల్పనారూపము 10 ఉపమానరూపము 11 అన్యంతరూపము 12 త్యాంతరూపము 13. ఆశీరూపము 14. స్తుతిరూపము 15. సంఖ్యారూపము 16. ప్రశ్నితరూపము, 17. పరిదేవనారూపము, 18. ప్రైవరూపము, 19. అన్వేషణారూపము, 20, వృష్టరూపము,

21. ఆఖ్యానరూపము, 22. అనుషంగరూపము, 23. ప్రయోగ రూపము, 24. సామార్థ్యరూపము, అని 24 విధములు.

మంత్ర బ్రాహ్మణాత్మకమగు ఋగ్యజుస్సామాథర్వణము లన్నియు ఏకథా అపౌరుషేయములున్ను నిత్యములున్ను, స్వతః ప్రమాణములున్ను అయినవేగాని కాలక్షేపముచే ఆయాపురుషులచే రచింపబడిన వెంతమాత్రముకావని నిరూపించుట కీవిభాగమిచట ప్రదర్శింపబడినది. మున్ముందు ద్వితీయాది సంపుటములందు ఈ 24 యొక్క వివరములివ్వబడును.

ఈ మంత్రబ్రాహ్మణములు రెంటియొక్క రహస్యమును సర్వదేవతారహస్యమును, సర్వవిధకర్తృరహస్యములను, సర్వవిధకర్మరహస్యములను, సర్వవిధక్రియారహస్యములను బోధించుజ్ఞానభాగమే "ఉపనిషత్తు"నబడును, మన్వాది స్మృతికారులున్ను శబరశంకరాది భాష్యకారులున్ను, వేద రహస్యమే ఉపనిషత్తనిరి.

ఇకను యజుర్వేదములోని తైత్తిరీయశాఖలో నేయే విశేషములున్నవో క్లుప్తముగా ప్రదర్శింపబడును. ఇందు సంహితాభాగం 7. కాండలు 44 ప్రపాఠకములు. బ్రాహ్మణభాగము 3. కాండలు 28ప్రపాఠకములు. ఆరణ్యకము 10ప్రపాఠకములు మొత్తం 82ప్రపాఠకములు. అందలివిషయ సంగ్రహమిట్లుండును.

సంహిత

సంహిత1-1లో మొదటి 13అనువాకములలో, దర్శ పూర్ణమాస యాగమునకు సంబంధించిన మంత్రము ప్రాయశః

యజుస్సులు. చివరి14వ అనువాకమంతయు పూర్తిగా కామ్య ములగు ఋఙ్మంత్రములు—

1–2లో మొదటి 13 అనువాకములలో సోమయాగ సంబంధిమంత్రములు ప్రాయశః యజుస్సులు కొన్ని ఋక్కులున్న చివర 14వ అనువాకమంతలో పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్నవి.

1–3 సోమయాగసంబంధి మంత్రములు ప్రాయశః యజు స్సులు చివరఅనువాకమంతలో పూర్తిగాకామ్యములగుఋఙ్మం త్రములున్నవి.

1–4లో ప్రాయశః సోమయాగ సంబంధియజుర్మంత్ర ములు చివరియనువాకములో పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్నవి.

1–5లో పునరాధానవిధి, తదీయ దేవతాస్వరూప బోధక ఋఙ్మంత్రములు, తద్బ్రాహ్మణము అనునవి నాలుగను వాకములలోను, 5నుండి8 వరకు అనువాకములలో,అగ్న్యుపస్థాన ముకొరకు, ఋఙ్మంత్రములు యజుర్మంత్రములు, వాటిబ్రాహ్మ ణమున్ను, 9అనువాకములో, పైఅగ్న్యుపస్థానము ప్రతిదినము ఆచరించు అగ్నిహోత్రయాగమున కంగమని బోధించు బ్రాహ్మణమున్ను, 10 అనువాకములో, ప్రవాసేచ్ఛ గల ఆహితాగ్ని చేయదగిన అగ్న్యుపస్థానమంత్రములున్న(ఇందును ఋఙ్మంత్రములు యజుర్మంత్రములు గలవు) 11అనువాకమందు పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను గలవు.

1–6లో 1నుంచి6వరకుగల అనువాకములలో దర్శాది యాగములందు యజమాని చెప్పదగు, ఋఙ్మంత్రములు,యజు

ర్మంత్రములున్ను, 7నుంచి11వరకుగల అనువాకములలోవీటి బ్రాహ్మణమున్ను 12వ అనువాకమందు పూర్తిగా కామ్యములగుఋఙ్మంత్రములున్ను గలవు.

1-7లో1నుంచి 6అనువాకములలో దర్శాదియాగీయ యాజమాన ఋగ్యజుర్మంత్రముల యొక్క-బ్రాహ్మణమున్ను, 7నుంచి12వరకు అనువాకములలో వాజపేయ యాగమందలి, ఋగ్యజుర్మంత్రములున్ను, 13అనువాకములో పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను గలవు.

1-8లో1నుంచి20వరకు అనువాకములలో రాజసూయ యాగమందలి ఋగ్యజుర్మంత్రములు, వాటిబ్రాహ్మణమున్ను 21 అనువాకములో, సౌత్రామణి యాగమందలిమంత్రములు వాటిబ్రాహ్మణమున్ను 22అనువాకములోపూర్తిగా కామ్యము లగు ఋఙ్మంత్రములున్ను గలవు

ఈ రాజసూయయాగ ప్రకరణమందే, చాతుర్మాస్య లనుసంజ్ఞగల 1. వైశ్వదేవము 2. వరుణప్రఘాస 3. సాకమేధము 4. శునాసీరీయములను భేదములతో నొప్పుహవిర్యాగము గూడ ఇమిడియున్నది. రాజసూయము చేయజాలని ఆహితాగ్నులుగూడ ఈచాతుర్మాస్య యాగము నాచరింపవర్హులు. ఇంతటితో తైత్తరీయ సంహితలోని మొదటికాండసమాప్తి.

ఇక రెండవకాండకు "కామ్యకాండ" యనిసంజ్ఞ అనగా ఆయాకోరికలు గలవారు తమయభీష్టమును నెరవేర్చుకొనుట కాచరింపవదగినయాగములు.ఇవి1.పశుయాగములు 2.హావిర్యాగములు అనిరెండు విధములుగనున్నవి. ఈ కాండలోగల 5. ప్రశ్నలలో 4. ప్రశ్నలలో ఈకామ్యయాగాదులున్నవి.

2-1ఆదినుంచి 9వరకుఅనువాకములలో 1భూతికామన 2. గ్రామకామన 3. ప్రజాకామన 4. దీర్ఘవ్యాధినివృత్తికామన 5. పశుకామన 6. జలోదర వ్యాధినివృత్తికామన 7. పశుసమృద్ధిచేతగలుకీర్తికామన 8 ప్రజాసమృద్ధిచేగలుకీర్తికామన 9. బ్రహ్మవర్చసకామన 10. వాగింద్రియముండికూడ మాట్లాడలేని వానికి తన్నివృత్తికామన 11. విద్యయుండియు శోభించనివానికి తన్నివృత్తికామన 12. పౌరోహిత్యమందు స్పర్ధకామన 13. శత్రుజయకామన, 14. యుద్ధమందుజయకామన, 15. అన్నకామన, 16 రాజ్యాధికారముండినను రాజ్యముప్రాప్తించనివానికి తత్ప్రాప్తికామన, 17. ప్రతిష్ఠాకామన, 18. పోయిన ఐశ్వర్యమును తిరిగిపొందుకామన, 19. పాపనివృత్తికామన, 20. చర్మవ్యాధినివృత్తికామన, 21. కారాగారబంధనివృత్తికామన, 22. వంశపరంపరలో, సోమపానము విచ్ఛిన్నముకాగా, తనకాయధికారము లభించవలెననుకామన, 23. అభిచారకామన, 24. ఇంద్రియకామన, 25. ధనలాభకామన, 26. తెలియబడని దీర్ఘవ్యాధినివృత్తికామన, 27. విద్యాశ్రద్ధాదులుండియు, యాగమాచరింపలేని వానికి అట్టియాగకామన, 28. వృష్టికామన, 29. అన్నముండియు. తింటే అన్నమఱగనివానికి తన్నివృత్తికామన, 30. పుష్టికామన, 31. యుద్ధాదిసమయములందు కాలోచిత ఉపాయములు స్ఫురింపవలెననుకామన, 32. పుష్టికామన, ఇత్యాదుల కుపాయబోధక కామ్య పశుయాగవిధులున్న, 10 అనువాకమందు, 1. దుర్బ్రాహ్మణునకు సోమపానేచ్ఛగలుగ, అందులకుపాయము, 2. ఒకడితరుల కపకార-

మొనర్చుచున్నను ఇతరులీతనికపచార మొనర్చుచుండ అందులకు ప్రతీకారోపాయము, 3. సోమయాగములందు "ఆశ్వినశస్త్ర" మను ఋగ్వేదమంత్రపఠన కాలమందు సూర్యుని అనావిర్భావమందు తత్ప్రతీకారోపాయము, ఇత్యాది నైమిత్తిక పశుయాగలున్ను, 11 అనువాకమందు పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్నగలవు—ఇందొక విశేషము గమనింపనగినది. ఒకే కామన నెరవేరుటకుపాయములుగా అనేక యాగవిధులుండుటయే. ఉదాహరణము ఒకే ప్రజాకామనగలవాడు తనయభీష్టసిద్ధికి సాధనగాని 1యుద్విశేషయుక్తుడగు వాయు దేవతనుద్దేశించి పశుద్రవ్యమును త్యాగ మొనర్చుట యనుయాగము నాచరింపవలెను. నియుత్తులనగా, అనేకవేలసంఖ్యతో నొప్పువాయు వాహనమున్ను, వాయువును ధరించునట్టిన్ని శక్తివిశేషము 2. ప్రజాపతి దేవత నుద్దేశించి తూపరమగు అజపశుద్రవ్యమును త్యాగ మొనర్చుటయనుయాగము నాచరింపవలెను, 3, సోమ దేవతనుద్దేశించి, బభ్రుపశుద్రవ్యమును త్యాగ మొనర్చుటయు, అగ్ని దేవతనుద్దేశించి కృష్ణగ్రీవపశుద్రవ్యమును త్యాగ మొనర్చుటయు ననుయాగము నాచరింపవలెను, 4. ఓషధీ దేవతల నుద్దేశించి వేహాతపశుద్రవ్యమును త్యాగ మొనర్చుటయను యాగమునాచరింపవలెను, 5. మిత్రావరుణులను దేవతనుద్దేశించి ద్విరూపపశుద్రవ్యమును త్యాగ మొనర్చుటయనుయాగము నాచరింపవలెను.

దీనిచేమనము గ్రహింపదగిన దేమనగా, సంతానము కల్గుటకు 1నియుద్విశేషణయుక్త వాయువు 2ప్రజాపతి 3సోమ

అగ్నులు 4ఓషధీ దేవత 5మిత్రావరుణులు ఇత్యాది అనేక దేవతాపచారము ప్రతిబంధకముగా నేర్పడియున్న దనియు, అందును ఒకనికి ఈఅయిదుగురిలో ఒక దేవతాపచారమున్న ఇంకొకనికి అనేకదేవతా పచారములున్న నిమిత్తములుగా నుండెననియు, వారినారాధించినచో ఆప్రతిబంధకము తొలగు ననియు ఆయాదేవతానుగ్రహమున కాయాద్రవ్యాదులే సాధనములనియు గ్రహింపనగును-ఇది పురుషమాత్రు తెలుగ జాలరు గదా!

అట్లే ఒకే దేవత, అనేక కామనలను నెరవేర్చుటకు సాధనముకూడ నగునని తెలియుచున్నది, ఎట్లనగా ఒకేనియుద్దేశే షణయుక్త వాయు దేవత, గ్రామకామన, ప్రజాకామన, దీర్ఘ రోగనివృత్తి కామనలను మూటిని నెరవేర్చుటకు సమర్థుడై యున్నాడు, ఇంతేగాక ఈ దేవతలుగాని, వీరిఅపచారజనిత దోషముగాని, ఇదంతయు, ప్రతిజీవుని దేహేంద్రియములందు ప్రత్యక్షముగా నున్న దేగాని పరోక్ష మెంతమాత్రముగాదని "వాయుమేవ స్వేనభాగధేయేనోపధావతి ఇంద్రమేవ స్వేనభాగధేయేన" ఇత్యాది ఫలవాక్యములవలన తెలియుచున్నది, అనగా ప్రతిజీవునియొక్క దేహావయవములందలి, ఇచ్ఛా,జ్ఞాన, క్రియాశక్తులే దేవతలనియు, తద్గత, రాగద్వేషాదులే, దేవతాపచారజనితదోషములనియు, తన్నివృత్తియే ఈయాగఫలము లనియు తాత్పర్యము.

2-2 ఇక రెండవప్రశ్నలో దర్శాదియాగ కాలాతిపాత నిమిత్తము చేగల్గు దోషములకు నివృత్త్యుపాయము లగు పథికృ

దిష్టి, 2యాగకాలిక నియమాతిక్రమణ నివృత్త్యుపాయమగు వ్రాతపతేష్టి 3, రాక్షసబాధానివృత్త్యుపాయ మగు రక్షోఘ్నేష్టి 4 ఆభిచారిక నివృత్త్యుపాయమగు రుద్రదేవతేష్టి 5పురుషుల యొక్క గోవుల యొక్క మరణములు నిమిత్తమైనపుడు తన్నివృత్త్యుపాయమగు సురభిమతేష్టి 6.యుద్ధప్రయాణము, అపమృత్యుప్రాప్తి గృహదహనము, ఇత్యాదినిమిత్తములు గల్గినపుడు తన్నివృత్త్యుపాయమగు క్షామవతేష్టి, 7.పుత్రజననముగాని, అనేకదర్శపూర్ణమాసయాగానాచరణముగాని నిమిత్తమైనపుడు, తచ్ఛ్రేయః ప్రాప్త్యుపాయమగు వైశ్వానరేష్టి తురీయాశ్రమ స్వీకారేచ్ఛ నిమిత్తమైనపుడు చేయదగు అగ్నివైశ్వానరేష్టి యను నైమిత్తిక హవిర్యాగ విధులు(ఇష్టులు)న్నవి.

1ప్రజాకామన 2క్షేత్రస్పర్థ, జ్ఞాతిస్పర్థలందు కామన 3యుద్ధజయకామన 4క్షేత్రపతిత్వకామన 5. అభీష్టసిద్ధికామన 6. పూర్ణాయుఃకామన 7. ఐశ్వర్యకామన 8. కాంతికామన 9. ఆరోగ్యకామన 10. తేజస్కామన 11. అన్యాభిభవశక్తి కామన 12. అన్నసమృద్ధికామన 13, అన్నము ననుభవించు కామన 14. అన్నప్రదానత్వకామన 15. దీర్ఘరోగనివృత్తి కామన 16. నేత్రరోగనివృత్తికామన 17. రసవత్త్వకామన 18. వసుమత్త్వకామన 19. పరాపకార ప్రతీకారకామన 20. గ్రామకామన 21. పశుకామన 22. బ్రహ్మవర్చసకామన 23. పాపనివృత్తికామన 24.బంధవిమోచనకామన 25.నిర్విఘ్న యాగానుష్ఠానకామన 26.చిత్తస్థైర్యకామన 27. జ్ఞానకామన 28. ఇంద్రియకామన 29. చర్మరోగనివృత్తికామన 30. బం

ఘూర్గమనకామన ఇత్యాదులుగలవారికి తత్తత్ప్రాప్త్యుపాయ బోధకములగు కామ్యేష్టి విధులున్ను, చివరి యనువాకములో పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను గలవు. ఇచట గూడ ఒకేకామన కనేకదేవతాక యాగభేదములున్ను, ఒకేదేవత అనేక కామనల నెరవేర్పుకై కిగలిగి యుండుటయు గోచరించును. గాన ఒక దేవతోపచారముచే ననేక విషయములలో ప్రతిబంధకముండుటయు, ఒకే విషయమందలి ప్రతిబంధకము అనేక దేవతోపచార మూలకమున్ను యనువిశేషము గ్రహింపదగియున్నది.

2-3 ఇందుగూడ, ఐశ్వర్యము, రాష్ట్రము, రాజ్యము, అపమృత్యునివృత్తి బ్రహ్మవర్చస్సు, హిరణ్యము, ఇంద్రియము, పశువులు, నపుంసకత్వనివృత్తి, గ్రామము, సుఖము, నేత్రరోగనివృత్తి, దీర్ఘాయువు, పాపనివృత్తి క్షయవ్యాధినివృత్తి సంతానము, ఇత్యాదులను కోరువారికి తదుపాయములగు అనేక కామ్యేష్టివిధులున్ను, 1. అగ్నిష్టోమాది సోమసంస్థలందు సోమరసవమననిమిత్త దోషనివృత్తికరమగు సోమేంద్రేష్టియు, 2. యజ్ఞభ్రంశనిమిత్త దోషనివృత్తికరమగు ఐంద్రాగ్నేష్టియు ఇత్యాదినైమిత్తికేష్టి విధులున్ను, 9 అనువాకమందు అశ్వమేధయాగములో, సర్వజన చిత్తరంజనకు సాధనమగు సాంగ్రహణేష్టిలోని కొన్ని మంత్రములున్ను, చివర యనువాకములో పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను గలవు-

2-4 ఇందునుకొన్ని, నైమిత్తికేష్టివిధులు, కొన్ని కామ్యేష్టివిధులున్నుగలవు. అందు వర్షసమృద్ధిని, ఎట్టి దేశకాల

పరిస్థితులందైనను గంటలలో కలుగజేయు నుపాయమగు కారీరీష్టి, పశుసమృద్ధిని గలుగజేయు చిత్రాయాగము, ప్రజాపశుసమృద్ధ్యుపాయమగు గార్హ్యేష్టి, సర్వకామప్రదమగు త్రైధాతవీయేష్టి, సర్వోత్కృష్టమగు "గాయత్రీష్టి" ఇత్యాదియాగముల విధులుగలవు- స్థూలదేహమందలి, చర్మమాంసరుధిరమేదోమజ్జాస్థ్యస్థులను సప్తధాతువులకు కారణములగు "ఓజస్సు' సహస్సు, బలము, భ్రాజస్సు, దేవానాంధామ, విశ్వము, సర్వము," అను పారిభాషికసంజ్ఞలతోనొప్పు, సంస్కారవిశేషములను, సాధకునకుగలుగజేసి, పరమపురుషార్థమగు మోక్షమునకు ఉత్తమాధికారమును ప్రసాదింపజేయునదే ఈ "గాయత్రీష్టి-" మామూలుప్రకారము ఈపన్నములోగూడ చివరి యనువాకము పూర్తిగా కామ్యములకు ఋఙ్మంత్రములతోనే యున్నది.

2-5 ఇంతవరకుపదేశింపబడిన, కామ్య, నైమిత్తికేష్టులన్నిటికిని దర్శపూర్ణమాసయాగములే ప్రకృతి యనబడును. యాగానుష్ఠానప్రక్రియ పూర్తిగా బోధింపబడుటయే "ప్రకృతి" మరియు ప్రకృతి యాగానుష్ఠాతలకే ఈ కామ్యేష్ట్యధికారత యుండును. గాన ఇపుడా దర్శపూర్ణమాస యాగవిధివిశేషములీవన్న మందున్నవి.

సత్సంతానప్రాప్తికిని, కలిగిన సంతానము తమ వేదవిధులగుటకును, బీజక్షేత్రశుద్ధియనగా తల్లిదండ్రుల శుక్లశోణితపరిశుద్ధత అత్యంతావశ్యకము. దానినే ఈ దర్శపూర్ణిమాస యాగములు గలుగజేయ గలవు. అందులకే ఇవి అవశ్య.

కర్తవ్యములని, నిత్యములని చెప్పబడును.

ఇందు పురుష గత "శుక్ల" పరిశుద్ధత కొరకేర్పడిన దే దర్శయాగ మందలి ఇంద్రదేవతాకమగు పాలు, పెరుగులను ద్రవ్యముతో చేయు "సాన్నాయ్యయాగము-" స్త్రీ గత "శోణిత" పరిశుద్ధతకొరకేర్పడిన దే పూర్ణిమాసయాగమందలి అగ్నీషోమ దేవతాకమగు. పురోడాశ ద్రవ్యముతో చేయు "అగ్నీషోమీయ యాగము-" ఇందు కవసరమైన రజస్వలా స్త్రీధర్మములు, అందలి గుణదోషములుగూడ ఇందుపదేశింపబడినవి. ఎట్లనగా బ్రహ్మహత్యాదోషమే స్త్రీలకుగల్గు రజఃప్రవృత్తి-గాన మూడహోరాత్రములు ఆమె భర్తతోగాని ఆమెతో భర్తగాని మాట్లాడినచో ఆమెసంతతి మిథ్యాపవాద యుక్తమగును. ఆమె అనాచ్ఛాదితమగు బహిరంగప్రదేశమందుండుచో, ఆమెసంతతి చోరులగును. ఆమె పరాఙ్ముఖిగా నుండుచో, ఆమెసంతతి సభలో మాట్లాడలేక పోవును. ఆమె ఆమూడురోజులలో స్నానమొనర్చుచో,తత్సంతతి ఉదకమందు మరణము నొందుటయను దుర్మృతినొందును. ఆమె తలకు చమురు రాచుకొనేయడల తత్సంతతి దుష్టచర్మముగలదగును. ఆమె గోడమీదగాని, నేలమీదగాని, వస్త్రముమీదగాని, బొమ్మలువగైరా, లిఖించుచో తత్సంతతి బట్టతలగలదగును. ఆమె కాటుకను ధరించుచో తత్సంతతి నేత్రరోగియగును. ఆమె దంతధావన మొనర్చుచో తత్సంతతి పిప్పిపళ్ళుగల్గుట మొదలగునంతరోగి యగును. ఆమెగోళ్ళను కొరుకుటగాని కత్తిరించుటగానిచేయుచో, తత్సంతతి పిప్పిగోళ్ళు కల్గియుండును. ఆమె

గడ్డి మొదలగు వాటిని ఛేదించుచో తత్సంతతి నపుంసకమగును. ఆమె త్రాడు పేనుచో తత్సంతతి ఉరిశిక్షతో మరణ మొందును. ఆకుతో నీరు మొదలగువాటిని పాన మొనర్చుచో తత్సంతతి ఉన్మత్తమగును. ఆమెకాల్చిన మట్టిపాత్రతో పాన మొనర్చుచో తత్సంతతి మరిగుజ్జు అగును. గాన ఆయాపనులు చేయరాదు. ఇచట సంతతి యనగా ఏడుతరములని యర్థము. గాన ఈతరములలోనుండు ఈదోషనివృత్తి చేసినగాని, ఉత్తమ వేదవేత్తలగు సంతతి గలుగ నేరదు. గాన తద్దోష నివృత్తికొరకు పూర్ణిమాస యాగ మొనర్ప వలెను.

ఇట్లే పురుషుల ఇంద్రియములోని స్వచ్ఛమగు శక్తి స్వరూపమే ఇంద్ర దేవత. అయ్యది అనేక జన్మలనుంచి వీరి ఆహార విహారాదులయందలి దోషములచేతను, వంశానుగత దోషములచేతను దూషితమైనందున అట్టిదోషములన్నింటిని సంస్కరించి దానిస్వస్వరూపమగు ఇంద్రదేవతాత్వమును పొందించు సాధన విశేషముగాన "సాంనాయ్య యాగము"ని అన్వర్థసంజ్ఞ. ఇది దర్శయాగములోని ఏకదేశము.

ఇట్లు స్త్రీపురుషులిద్దరును, సంస్కారాభావముచే, పరస్పర సంయోగజనిత దోషావిష్టులై, శుక్లశోణిత దోషములతో నొప్పియున్నందున, ఈదర్శపూర్ణిమాస యాగములను అనేకమార్లు ఆచరింపగా, నిర్దుష్టమగు శుక్లశోణిత వంతులగుదురు. కావుననే కేవలదర్శయాగమునకుగాని కేవలపూర్ణిమాసయాగమునకుగాని ఫలము వేదమందు వినబడక, రెంటికి కలసియే ఫలశ్రుతి గోచరమగుచున్నది.

ఈ ఉభయకర్తలందలి దోషనివృత్తి నిష్పాదింపజేయు ఋగ్వేదీయ మంత్రములే "సామిధేను" లనబడును, దర్శపూర్ణమాసలను రెంటికి సాధారణమగుచున్నవి. ఈ పన్నమందా మంత్రములు లేవ్రగాని, తద్బ్రాహ్మణము, తద్విధులు కామనాభేదముచే, వాటిసంఖ్యాది భేదవినియోగాదులు, ఆ ఋఙ్మంత్రములను యాగమందుచ్చరించు "హోత" యను ఋత్విక్కుయొక్క నియమాదులున్న ఈ అయిదవ పన్నమందున్నవి. ఇట్లు 11 అనువాకములలో ఋక్కులయొక్కయు యజుస్సులయొక్కయు, బ్రాహ్మణమున్ను, 12వ అనువాకమందు పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను, ఇందున్నవి.

2-6 ఇందుకూడ సర్వహవిర్యాగములకును ప్రకృతియగు దర్శపూర్ణమాసలందలి, పూర్వాంగములు, ఉత్తరాంగములు, వాటి స్వరూపము తద్విధులు ఇత్యాదిగా, యజుర్బ్రాహ్మణమున్ను, ఋక్కులయొక్క బ్రాహ్మణమున్ను గలవు. యజమానియొక్క చిత్తమందు తామసవృత్తులను నిరోధించి సాత్త్వికవృత్తులను, తద్ద్వారా దేవతాస్వరూపయోగ్యతను కలుగజేయుట, పూర్వాంగముల ప్రయోజనము. అనేక శబ్దస్పర్శాది విజ్ఞానములకైయు తనయందుంటున్నవిగాన తానే "సంవత్సరు" డనబడును. ఈ విజ్ఞానసమూహమే, అనేకమార్లు పుట్టుచుండునట్టి జగత్తునకంతకు అధిపతిగాన యిదియే "ప్రజాపతి" యనబడును. విజ్ఞానవిశేషములే "వసంతాదిఋతువు" లనబడును. గాన యజమాని

ఋతు దేవతా ప్రీతిద్వారా, ప్రజాపతియనబడు సంవత్సర దేవతాప్రీతిని పొందిుటట ఈపూర్వాంగములలోనిఉద్దేశ్యము. అట్లే హోమము నగ్నియందొనర్చి, తనయందును, ఋత్విక్కులందునుగూడ చేయుటద్వారా, యజమానియొక్క దేవతా జ్ఞానవిశేషవిధి ఉత్తరాంగముల ఉద్దేశ్యము. వీటిమంత్రములు ఋగ్వేదమైనను, ఈ పన్నమందుతద్బ్రాహ్మణము, త్వాదినియోగ విశేషములున్ను గలవు- చివర రెండనువాకము లలో పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్నవి. అందును 11అనువాకములలో "గాయత్రష్టి"కి సంబంధించినట్టి ఋక్కులున్ను 12 అనువాకములో "పితృయజ్ఞమునకు సంబంధించిన ఋక్కులున్ను గలవు. ఇంతటితో రెండవకాండసమాప్తము.

ఇకమూడవకాండ వివరింపబడు చున్నది అందు:

3-1లో అగ్నిష్టోమాది యాగములందు దీక్షితుడగు యజమాని చెప్పదగిన ఋగ్యజుర్మంత్రములు, అమేధ్యదర్శనము వర్షము ఇత్యాదినిమిత్తములందు చేయదగిన ప్రతీకారోపాయములు, సోమదేవతను స్తుతించుమంత్రములు, యాగములందలి విధివిశేషములు, పశూపాకరణ మంత్రములు (ఋక్కులు& యజస్సులు)తద్బ్రాహ్మణము, పరస్పరమాత్సర్యముతో చేయు సోమయాగములందలి ప్రక్రియాభేదములు, ఇట్లు సోమసంస్థ యొక్క ఋగ్యజుర్మంత్రములున్ను, కొన్ని బ్రాహ్మణవిధులున్ను, చివరిఅనువాకమందు పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను గలవు.

3-2 ఇందుగూడ సోమయాగములలోని, సోమరసమును గ్రహించు "గ్రహ"ముల స్వరూపము, మూడుసవనముల స్వరూపము, సోమపానస్వరూపము, ఋగ్వేద, సామవేద మంత్రములతో యజుర్వేదమునకు గలసంబంధాది విశేషానుబంధము, ఇత్యాదిగా, కొన్ని ఋగ్యజుస్సామమంత్రములున్ను కొన్ని బ్రాహ్మణవిధి విశేషములున్ను, చివరియనువాకమందు పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను గలవు.

3-3 ఇందుగూడ సోమయాగములలోని, స్తోత్ర, ఉపాకరణ, గ్రహ, అవభృథాదులకు సంబంధించిన, ఋగ్యజుర్మంత్రములున్ను, సోమయాగ వికృతులందు చేయదగు కొన్నిమార్పులు, ఋత్విక్కులుచ్చరించు నాల్గు వేదమంత్రములకు పరస్పర సంబంధమును బోధించు బ్రాహ్మణమున్ను "వృషాలంభ" మను నొకస్వతంత్రకర్మయు, పశుయాగములో పశువుగర్భిణియైనట్లు పశుసంజ్ఞపనానంతరము తెలియబడుచో చేయదగు ప్రాయశ్చిత్తమున్ను, చివరి యనువాకములో పూర్తిగా కామ్యములగు ఋఙ్మంత్రములున్ను గలవు.

3-4 ఇందు పశుయాగమందు సంభవించు కొన్ని దోషములకు ప్రాయశ్చిత్త మంత్రములు, (ఋక్కులు + యజుస్సులు) తద్బ్రాహ్మణము, తద్వినియోగవిధులు, కామనాభేదముచే పశుయాగమందలి మంత్రభేదములు, తద్వినియోగభేదములు, "జయాదులు" "అభ్యాతాన"ములు "రాష్ట్రభృత్తులు" అను నన్వర్థసంజ్ఞగల, సర్వయాగ సాధారణహోమ మంత్రములు, తద్విధివిశేషములు, ఈ జయాదిత్రివిధ మంత్రములతో,

ఆ యా కామనాభేదములను నెరవేర్చుకొను విధివిశేషములు, ఈ విధముగా, ఋగ్యజుర్మంత్రములున్ను, ఆ రెంటియొక్క బ్రాహ్మణమున్ను, చివర యనువాకములో పూర్తిగా కామ్య ములగు ఋఙ్మంత్రములున్ను గలవు.

3-5 హవిర్యాగ సోమసంస్థలందు యజమాని భావింప దగు స్వర్గగమన మంత్రములకే "విష్ణుక్రమము" లని సంజ్ఞ. తత్సుఖమునకు నిమిత్తములగు మనుష్యదేహ, తత్కర్మము లన్నిటిని అతిక్రమించినప్పుడే దేవానందము లభించునుగాన తదర్థబోధక మంత్రములకే "అతిమోక్షము" లని సంజ్ఞ. ఈ పన్నమందీద్వివిధ మంత్రములున్ను, సోమసంస్థలందు "బ్రహ్మ"యను ఋత్విక్కుయొక్క విధివిశేషములున్ను, యజమాన పత్నికి సంబంధించిన మంత్రములున్ను, పశుప్రద్రవ్యముగాగల యాగములందు "హోత"యను ఋత్విక్కు చెప్పదగిన ఋఙ్మంత్రములున్ను, జుహూ, ఉపభృత్తు మొదలగు యజ్ఞాయుధము లేయే వృక్షజాతితో నిర్మింపబడవలెనో తద్విధులున్ను, దర్శపూర్ణమాసేష్ట్యంగ భూతమగు "అన్వారంభణీయేష్టి"లోని మంత్రములున్ను తద్విధులున్ను గలవు. మామూలు ప్రకారం, చివరియనువాకమంతయు ఋగ్వేదమే. ఇంతటితో మూడవకాండసమాప్తము.

ఇంతవరకు గమనింపదగిన విశేషమొకటి గలదు. ఏమనగా రెండవ కాండలో రెండవ, మూడవ, నాల్గవ ప్రశ్నలు మూటిలోను, కొన్ని నైమిత్తిక కామ్యహవిర్యాగములు లేక ఇష్టులు విధింపబడినవని లోగడ తెలిసికొంటిమి. వాటి ఆచరణ

ప్రక్రియ "దర్శపూర్ణమాస యాగమువలెనే యుండును. కొన్ని మార్పులు మాత్రముండును. ఆ మార్పులావిధి సమీపమందే ఉపదేశింపబడెను. కాని ఆ ఇష్టులందు దేవతా స్వరూప బోధకములున్న, దేవతాహ్వాన కరములున్న, హోతయను ఋత్విక్కుచే పఠనీయములున్న అగునవి ఋఙ్మంత్రములే అవశ్యమై తీరవలెను. అవి ఇంతవరకుగల మూడు కాండల సంహితలోనుగల 19 ప్రశ్నములలోను, చివరి యనువాకములలో అత్యంతవిభక్తముగ నలరారుచున్నవి. ఏ క్రమమున కామ్యనైమిత్తికేష్టి విధులున్నవో, ఆ క్రమముననే ప్రతిపన్నములోని చివరి యనువాకములలో ఈ ఋఙ్మంత్రములున్నవి.

**4–1** ఇకను నాలుగవకాండకు "అగ్నిచయన" కాండయని సంజ్ఞ. లేక అగ్ని "కాండ" మని సంజ్ఞ. ఉక్థ్య, షోడశీ, "మొదలగుసోమసంస్థలాచరించుట కనుగుణ, అగ్నియొక్క మూడవస్థాయికి "చిత్యగ్ని" యనిసంజ్ఞ. వివిధాకారములు గల ఇష్టకలను, మంత్రాది సంస్కార పురస్సరముగా తయారుచేసి, వాటిలో నాయా దేవతలను భావించిన మంత్రకముగా, ఒకానొక ఆకారము వచ్చునట్లుగా పేర్చి, అందు పూర్వమందుపాసింపబడు ద్వితీయ స్థాయిలోనున్న అగ్నిని ప్రతిష్ఠించి, ఆరాధించుటయే "మహాగ్నిచయన" మను సంజ్ఞలోని తాత్పర్యము. ఆ ఇష్టకలు, అనేకావాంతర భేదముగల, త్రికోణ, చతుష్కోణాది సర్వవిధ రేఖాగణితప్రసిద్ధాకారములతో నొప్పియుండును. అవి, సర్వజీవుల దేహములలోను, స్వభావముచే నేర్పడు సర్వవిధసంధి మర్మము లేయని వీటికేర్పడిన సంజ్ఞలలోని తాత్పర్యము. అట్లే

సర్వసంధిమర్మములలోను ఒక్కొక్క సంధిమర్మములోని అసాధారణశక్తివిశేషములే, ఆ ఇష్టకలందు మంత్రములద్వారా ప్రతిష్ఠింపబడు దేవతా విశేషములు- తన దేహమందెన్ని నాడులు సంధులు, మర్మములుగలవో, అందేవేవి ఏయే స్థానములలో నున్నవో, ఎట్టి కార్యకారణ భావముతో నొప్పియున్నవో, తానొనర్చు ప్రతి ప్రవృత్తిలోను, లోపల ఎన్నెన్ని ప్రక్రియా విశేషములు ఏక్రమమున జరుగుచున్నవో, తనసత్ప్రవర్తనలలోను దుష్ప్రవర్తనలలోను, లోపలజరుగు పైకలాపమంతలోను ఎట్టి భిన్నభిన్న ప్రక్రియలున్నవో, అందలి దోషములెట్టివో వాటిని సంస్కరించి సత్ప్రవర్తనగల్గుటకే యేప్రక్రియల నాచరింపవలెనో, ఇత్యాది విశేషములు మనుష్య మాత్రునకెంత మాత్రము గోచరింపవు గదా! వాటిని పుష్కలముగా బోధించునదే ఈ ప్రకరణము- ఇట్టి స్థాయిలోని "అగ్ని" యనగా సరజీవులందలి సర్వదేహావయవ, నాడీ సంధి, మర్మాదులందలి సర్వశక్తులనబడు సర్వదేవతలకు సమిష్టిరూపుడగు పరమేశ్వరుడే- ప్రథమస్థాయిలో, పశుపాకయజ్ఞములకున్ను ఆశ్రయమగు అగ్ని ఇట్టిపరమేశ్వరుడైనను, అపుడు సాధకుడగు యజమానికి, సర్వజీవులకును గృహమగు తమ దేహమందలి సర్వప్రవృత్తులకును ప్రేరకుడని మాత్రమే జ్ఞానముండును.

ద్వితీయ స్థాయిలోని అగ్ని ఇట్టి పరమేశ్వరుడైనను అపుడు యజమానికి, సర్వజీవుల సర్వప్రవృత్తులు, ముఖ, హృదయ, జఠరములను మూడు కేంద్ర స్థానములనుండి జరుగుచున్నవను జ్ఞానముమాత్రమే యుండును.

[illegible] దేవతాశక్తి సంస్థితమై [illegible] జ్ఞానమునందు [illegible]. ఇట్లు తర్కోత్తర [illegible] జ్ఞానము [illegible], సాధనోత్తరగాధికారమై [illegible] క్రమముగా కృతార్థుడగును.

ఈ చితి 5 పొరలు గలిగియుండును. ప్రతిపొరలోను గురుడాపి ఆకారము సంపూర్ణముగా నేర్పడును. 1. ఉక్థ 2. దుగ్ధము 3. గర్భము 4. [illegible] 5. పస్యము అను ఆ అయిదింటికి సార్థకనామములు – సర్వపురుష ప్రవృత్తులు గూడ ఈ అయిదు సోపానముల క్రమములోనే జరుగును.

అట్లే ఈ నాడీసంధి మర్మాది ప్రతీకములగు ఇష్టకలు గూడ 1. స్వయమాతృణ్ణలు, 2. అపస్యలు, 3. ప్రాణభృత్తులు 4. అపానభృత్తులు, 5. అశ్వినీష్టకలు 6. వయస్యేష్టకలు 7. బృహతీష్టకలు, 8. అక్షయోన్యాయోష్టకలు, 9. సృష్టీష్టకలు, 10. వ్యుష్టీష్టకలు, 11. అసపత్నేష్టకలు, 12. స్తోమభాగలు, 13. నాకసదిష్టకలు, 14. చోడేష్టకలు, 15. ఛందోభిధేష్టకలు, 16. సంయుజేష్టకలు, 17. విశ్వజ్యోతిష్టకలు, 18. భూయస్కృదిష్టకలు, 19. ఇంద్రతన్వేష్టకలు, 20. యజ్ఞతన్వేష్టకలు, 21. నక్షత్రేష్టకలు, 22. ఋతవ్యేష్టకలు 23. విహావ్యేష్టకలు, 24. రేతస్సిగిష్టకలు, 25. హిరణ్యేష్టకలు, 26. కుంభేష్టకలు, 27. భూతేష్టకలు, 28. ఋషభేష్టకలు, 29. వజ్రిణీష్టకలు, 30. రాష్ట్రభృదిష్టకలు, 31. అధర్వశిరఇష్టకలు ఇత్యాదిసార్థకములగు సంజ్ఞలతోనున్నవి.

అందు మొదటిప్రశ్నములో 1నుండి8వరకున్ను, 9, 10 అనువాకములందున్ను, ఈ అగ్నిచయనమునకు సంబంధించిన యజుర్మంత్రము లధికముగను, ఋఙ్మంత్రములు స్వల్పముగను ఉన్నవి. ఇందలి విశేషమేమనగా యజుర్వేద మంత్రములను చెప్పినా ప్రయోగమొనర్చు ప్రధాన ఋత్విక్కగు అధ్వర్యుడే తన ప్రయోగమందే చెప్పితీరవలసిన ఋగ్వేదీయ మంత్రములుగూడ యజుస్సులలో కలిసియున్నవి - ప్రారంభములోనే "యుంజానః ప్రథమం+ ఇత్యాది ఏడుఋఙ్మంత్రములను "ఇమంనోదేవ"++ అను ఒక యజుర్మంత్రమును, కలసి మొత్తం 8 మంత్రములతో ఒకే హోమము చేయబడియున్నది. ఋగ్వేదము ముందొక కాలములో రచింపబడి తరువాత కాలములో యజుర్వేదము వ్రాయబడినచో, ఈ 8 మంత్రములలోని మొదటి ఏడుఋక్కులకు, యజుర్వేదమేర్పడువరకు వినియోగములేక వ్యర్థముగా ఉండవలసి వచ్చును- అట్లైనచో అట్టివ్యర్థవేదమును వ్రాసినవాడెందులకు వ్రాసియుండెనో, ఆపత్తియునాలోచించి చెప్పవలయును గదా! ఇట్లనేకచోట్ల ఋగ్యజుర్మంత్రములకు కలసియే ఒక క్రియయందు వినియోగముగల ఘట్టములు, అన్ని వేదములందును పరశ్శతములుగలవు.

ఈ ప్రశ్నమందలి 7-8అనువాకములలో, ఈ మహాగ్నిచయనమందలి హోతృగణము చెప్పదగిన ఋఙ్మంత్రములతో పూర్తిగానున్నవి. చివరియనువాకమందు, చాతుర్మాస్యలను

హావిర్యాగములో నొకభాగమగు "వైశ్వదేవ" పర్వలో హోతయనుఋత్విక్కు చెప్పవలసిన ఋఙ్మంత్రములతో పూర్తిగా నున్నవి.

4-2 ఈ ప్రశ్నములోగూడ మహాగ్ని చయనమునకు సంబంధించిన, యజుర్మంత్రము లధికముగను, ఋఙ్మంత్రము లల్పముగను గలవు - రెండవయనువాకమందు, యజమాని అగ్ని దేవతను స్తుతించవలసిన ఋఙ్మంత్రములతో పూర్తిగానున్నవి. చివరి యనువాకములో, చాతుర్మాస్యలోని భాగమగు "వరుణ ప్రఘాస"యందు హోతయను ఋత్విక్కు చెప్పవలసిన ఋఙ్మంత్రములతో పూర్తిగానున్నవి.

**4-3** ఈ ప్రశ్నములోగూడ చయనసంబంధి యజుర్మంత్రము లధికముగాను, ఋఙ్మంత్రము లల్పముగాను గలవు. 11వ అనువాకములో, ఈ చయనమందే యజుర్వేదీయ ఋత్విక్కగు అధ్వర్యుడే చెప్పవలసిన ఋఙ్మంత్రములతో పూర్తిగా గలవు- చివరి యనువాకములో, చాతుర్మాస్యలను హావిర్యాగ మందలి మూడవ పర్వయగు "సాకమేధ" మందు హోతయను ఋత్విక్కు చెప్పవలసిన ఋఙ్మంత్రములతో పూర్తిగా నున్నవి.

4-4 ఈ ప్రశ్నమందుగూడ చయనసంబంధి యజుర్మంత్రము లధికముగాను, ఋఙ్మంత్రము లల్పముగాను కలసి యున్నవి. నాల్గవ యనువాకములో ఈ చయనమందే అధ్వర్యుడు చెప్పవలసిన ఋఙ్మంత్రములతో పూర్తిగానున్నవి. చివరి యనువాకములో, అశ్వమేధయాగములో హోతయను ఋత్విక్కు చెప్పవలసిన ఋఙ్మంత్రములతో పూర్తిగా నున్నవి.

[illegible] చేయబడుచుండు అగ్నిస్వరూపమే వినియుక్తకాని గాని, [illegible] స్తోత్ర ములు రెండును కలసి యున్నవి. ఈ పన్నమునందే యి, "[illegible]" అను పురాణపద్ధతియందు అగ్నియందు హోమము [illegible] చేయుచు ఒకే క్రియలో వినియోగపడునవి. ఇందు మొదటి అనువాకములో 15 ఋఙ్మంత్రములున్న, 2,3,4 అనువాక ములలో 47 ఉభయులలో సమహార యజుర్మంత్రములున్న, 5, 6,7, 8, 9, అనువాకములలో 82 అన్యసారములో సమహార యజుర్మంత్రములున్న, 10 అనువాకములో 12 ఋఙ్మంత్రము లున్న, 11 అనువాకములో 10 ఋఙ్మంత్రములున్న 3 యజుర్మం త్రములున్న గలవు. ఇట్టి రుద్రాధ్యాయమను నమకమందు 37 ఋఙ్మంత్రములున్న, 132 యజుర్మంత్రములున్న మొత్తము 169 మంత్రములున్న ఒకే వినియోగము గల్గియున్నవి కాన ఋగ్వేదము ఒకకాలములో వ్రాయబడి, యజుర్వేదము వేరొక కాలమందు వ్రాయబడినదనుపాశ్చాత్య విజ్ఞానవాదనా వాసితులగు నవీనులకీ పన్నము కంఠశోషగుచున్నది. వీరి వాదము ప్రకారమిచటి 37 ఋఙ్మంత్రములున్న, యజుర్వే దము వ్రాయబడువరకు గల మధ్యకాలములో త్రిశంకుస్వర్గ మువలె, ఎట్టివినియోగములేక వ్యర్థములగుచున్నవి. ఇట్టి వ్యర్థ మంత్రముల నెలవ్రాసెనో వీరే సమాధానము చెప్పవలెను.

ఇట్టి పన్నమంతయు కలసి సర్వదేవతా ప్రతీకములగు ఇష్టకా విశేషములన్నిటితోను తయారైనట్టి సంపూర్ణజ్ఞాన రూపుడై సర్వజగద్వ్యాపియగు "అగ్ని" లేక రుద్రుని స్వరూప

[illegible] నను హోమమందు వినియుక్తములగుచున్నవి.

4-6 ఈ ప్రశ్నమునందు పన్నెండు అనువాకములు. మొదటి యైదు అనువాకములు, ఈ మహాగ్నిచయనము నకు సంబంధించినవి. 6, 7, 8, 9 అను నాలుగనువాకములు, అశ్వమేధయాగమునకు సంబంధించినవి. అందున్న 1,3,5 అను వాకములలో, చయనసంబంధి ఋగ్యజుర్మంత్రములు కలసి యున్నవి. 2, 4 అను వాకములందు పూర్తిగా ఋఙ్మంత్రములే యున్నవి.

ఆరవ అనువాకములో అశ్వమేధ సంబంధి ఋగ్యజుర్మంత్రములు రెండును కలసియున్నవి. 7, 8, 9 అశ్వమేధ సంబంధిఋఙ్మంత్రములే పూర్తిగా నున్నవి.

4-7 ఈ ప్రశ్నములో 15 అనువాకములున్నవి. అందు మొదటి 11 అనువాకములకు "చమక"మని వ్యవహారమున్నది ఇందొక అపూర్వ విశేషమున్నది — ఏమనగా "అగ్నావిష్ణూ + + + వాజేభిరాగతం" అను ప్రథమానువాకగత ఆద్యవాక్యత్రయము యొక్క యజుర్మంత్రము, "వాజశ్చమే" మొదలు, 11వ అనువాకము పూర్తియగువరకు "భువనశ్చాధిపతిశ్చ" వరకుగల పదకొండనువాకములు గలసి మొత్తమంతయు ఒకే యజుర్మంత్రము. ఇది చయనక్రతువులో, చిత్యాగ్నియందేక ధారగా హోమమొనర్చుటలో వినియుక్తము— ఈ హోమమును నకే "వసోర్ధార" యని ప్రసిద్ధసంజ్ఞ—12, 13, 14 మూడనువాకములలో మహాగ్నిచయన సంబంధి ఋఙ్మంత్రములు

యాజుర్వేదీయ ఋత్విక్కగు అధ్వర్యుడు చెప్పవలసినవి కలసి యున్నవి. 15వ అనువాకమందు అశ్వమేధయాగములో నాక భాగమగు "మృగారేష్టి"లో, హోతయను ఋత్విక్కు చెప్ప దగిన ఋఙ్మంత్రములున్నవి. ఇంతటితో నాల్గవకాండ సమాప్తము.

5-1 ఇక అయిదవకాండను విచారింతము అందు మొదటిప్రశ్నములో ఆదినుంచి పదిఅనువాకములందు మహాగ్ని చయన బ్రాహ్మణమున్నది. అదియు 4-1లోగల, మహాగ్ని చయన సంబంధి ఋగ్యజుర్మంత్రములే క్రమముగా నున్నవో ఇందా క్రమముననే ఆ ఋగ్యజుస్సులకెంటి బ్రాహ్మణమున్ను కలసియున్నది. చివరిదగు 12వ అనువాకమందు అశ్వమేధ యాగములో హోతయను ఋత్విక్కు పఠింపదగు ఋఙ్మంత్ర ములే పూర్తిగానున్నవి.

5-2 ఈ ప్రశ్నములోగూడ ఆదినుంచి పదియనువాకము లందు, మహాగ్నిచయన మంత్రములకు బ్రాహ్మణమున్నది. అదియు 4-2 పూర్తిప్రశ్నములోను, 4-3లో మొదటి మూడను వాకములలోను, చయన సంబంధి ఋగ్యజుర్మంత్రములే క్రమముగానున్నవో, ఆ క్రమముననే ఇందలి బ్రాహ్మణ మున్నది. 11వ అనువాకమందు అశ్వమేధసంబంధి ఋగ్యజు ర్మంత్రములు, రాజభార్యలుచ్చరించ దగినవిన్ని, 12వ అను వాకమందు అశ్వమేధ మందధ్వర్యుడను యజుర్వేదీయ ఋత్విక్కుచ్చరింపదగిన ఋఙ్మంత్రములే పూర్తిగానున్నవి.

5_3 ఈ పన్నమందుగూడ ఆదినుంచి 11 అనువాకములలో, మహాగ్ని చయన మంత్రములయొక్క బ్రాహ్మణమున్నది. అదియు, 4_3 పన్నములోని 4 నుంచి 12 వరకు గల 9 అనువాకములలోను, 4-4 పన్నములోని మొదటి ఏడనువాకములలోను, మహాగ్ని చయన సంబంధి ఋగ్యజుర్మంత్రములే క్రమమున ఉన్నవో, ఈ బ్రాహ్మణ మాక్రమముననే యున్నది. 12వ అనువాకమందు అశ్వమేధయాగ విధిగలదు.

5_4 ఈ పన్నమందుగూడ ఆదినుంచి 10 అనువాకములలో మహాగ్ని చయనమంత్రములయొక్క బ్రాహ్మణమున్నది. అదియు 4 4 పన్నములోని 8, 9, 10, 11 అను నాల్గనువాకములలోను, 4-5 పన్నములో పూర్తిగాను, 4-6 పన్నములో ఆదినుంచి అయిదనువాకములలోను, మహాగ్ని చయనమందలి ఋగ్యజుర్మంత్రములే క్రమముతోనున్నవో, ఈ బ్రాహ్మణము గూడ నాక్రమముతో నొప్పియున్నది, పదకొండవ అనువాకమందు యజమానియొక్క కామనా భేదములనుబట్టి, మహాగ్ని చయనములోని "చిత్యగ్ని" యొక్క ఆకారవిశేషము, లేదేయే తీరుతో నొప్పియుండవలెనో, తద్విశేష విధులున్నవి. చివరిదగు 12వ అనువాకములో అశ్వమేధ యాగములోని, ఋక్సామ మంత్రములయొక్క విధి విశేషములున్నవి.

5_5 ఈ పన్నమందుగూడ ఆదినుంచి పది యనువాకములలో, మహాగ్ని చయన సంబంధమగు, విధులు, ప్రక్రియాభేదములు, హోమాదులెట్లు చేయదగినది, చయనఫలము, ఇష్టకలుపేర్చువిధి పూర్వము చెప్పబడని కొన్ని చయన

మంత్రములు, కొన్నిటికి బ్రాహ్మణము, కొన్ని యాజ్య మంత్రములకు ఇంకను వినియోగ భేదములు, ఇత్యాదులున్నవి— ఇక 11వ అనువాకమునుంచి చివరవరకు అశ్వమేధయాగ సంబంధమగు, కొన్ని గ్రామ్య, అరణ్యక పశుసంఘముల విధులు, ఆయా దేవతావిధులు గలవు—

5-6 ఈ పన్నమందుగూడ ఆదినుంచి పది అనువాకములలో, మహాగ్ని చయనమునకు సంబంధించిన, కొన్ని ఋగ్యజుర్మంత్రములు, కొన్ని ప్రక్రియాభేదములు, కొన్ని విధి విశేషములు, ఉపస్థానాదివిధులు, ఆసందీ, చితి, ఆహుతివిశేష విధులు, చయనప్రశంస ఇత్యాదులున్నవి. 11వ అనువాకము నుంచి, ఈ పన్నము చివరవరకు, అశ్వమేధయాగ సంబంధి పశుసంఘవిశేష, దేవతావిశేషముల నుపదేశించు విధు లున్నవి—

**5 .7** ఈ పన్నమందాదినుంచి పది యనువాకములలో మహాగ్ని చయనమునకు సంబంధించిన కొన్ని ఋగ్యజుర్మంత్రములు, ఇష్టకాభేదముల నెట్లు వయోగింపవగునో బోధించు విధులు, వ్రతవిశేషవిధులు ఇత్యాదులున్నవి. 11వ అనువాక మునుంచి, పన్నము చివరవరకు అశ్వమేధయాగ సంబంధమగు కొన్ని మంత్రములున్నవి. ఇంతటితో అయిదవకాండ సమాప్తము—

ఇక ఆరవకాండను తెలుసుకొందము: **6—1** అందు మొదటిపన్నములో, సోమసంస్థలేడింటికి ప్రకృతియగు "అగ్నిష్టోమ" యాగ సంబంధమగు బ్రాహ్మణమున్నది: సంహిత

మొదటి కాండ రెండవ ప్రశ్నములో ఆదినుంచి తొమ్మిది అను వాకములలో, ఈ సోమయాగీయ ఋగ్యజుర్ మంత్రములే క్రమములోనున్నవో, ఈ బ్రాహ్మణ మాక్రమములోనే యున్నది. ఇందు, కేశాది వపనము, స్నానము, వస్త్రధారణ, భోజనము, నవనీతము, కాలుక పెట్టుకొనుట మొదలగు క్రియలకు ఉపపత్తులున్నవి.

6 2 ఈ ప్రశ్నముగూడ పూర్తిగా సోమయాగ బ్రాహ్మణాత్మకమే – సంహిత 1–2లో 10, 11, 12, 13అను వాకములలోను, 1–3లో మొదటి రెండనువాకములలోను, సోమయాగీయ ఋగ్యజుర్మంత్రము లే క్రమములోనున్నవో, ఇందలి బ్రాహ్మణమాక్రమములోనే యున్నది. అతిథిసత్కారము, దుష్వప్నృత్తుల నుపసంహరించురీతి, ఉత్తర వేది, హవిర్ధాన మండపము, సదో మండపము ఇత్యాదుల ఉపపత్తివిశేషములు దేహములోని నాసిక, శిరస్సు, ఉదరము, ప్రాణములు ఇత్యాదుల పరస్పర సంబంధ విశేషములు ఇత్యాదులు ఇందు గమనించదగియున్నవి.

6–3 ఈ ప్రశ్నముగూడ పూర్తిగా సోమయాగ బ్రాహ్మణరూపమే. సంహిత 1–3ప్రశ్నములో, 3నుంచి10వరకు గల యెనిమిది అనువాకములలో సోమయాగీయ ఋగ్యజుర్మంత్రము లే క్రమములోనున్నవో ఈ బ్రాహ్మణ మాక్రమములోనేయున్నది. "సప్తహోతృకలు" అను సంజ్ఞగల ఋత్విక్కుల ఆసనస్థానములు, యజమానికి వీరికిగల ఆధ్యాత్మిక సంబంధము, యజమానికి, తనకుటుంబమందరితో గల

ఆధ్యాత్మికాది సంబంధవిశేషములు, యాగీయపశుస్వరూపము పశువులోని పశుస్వరూపవిశేషము, ఇత్యాదులిందు గమనింపదగినవి.

6-4 ఈ వన్నములోగూడ పూర్తిగా సోమయాగ బ్రాహ్మణమేగలదు. అందు సంహిత 1-3వన్నములో 11, 12 13అనువాకములలోను, 1-4వన్నములో ఆదినుంచి 11అను వాకములలోను, సోమయాగీయ ఋగ్యజుర్ మంత్రము లే వరుసలోనున్నవో, ఇందలి బ్రాహ్మణమూ వరుసలోనే యున్నది. ప్రతి శరీరములోను అనేక అవయవవిశేషములు, వాటి అసాధారణశక్తివిశేషములు, మనస్సుకు ఆ యా అవయవవిశేషములకుగల సంబంధములు, దేవతాస్వరూపాదికము, (Psychology & physiology) ఇత్యాది విశేషములిందు గ్రహింపదగియున్నవి.

6-5 ఈవన్నములోగూడ సోమయాగబ్రాహ్మణమే. అందు సంహిత 1-4 వన్నములో 12 నుంచి 28 వరకుగల అను వాకములలో సోమయాగీయ ఋగ్యజుర్మంత్రము లే క్రమములోనున్నవో, ఈ బ్రాహ్మణమూక్రమములోనే యున్నది. ఇందు ఆకాశ వాయ్వాది భూతములతో మనకున్న సంబంధ విశేషములు, యజ్ఞాయుధముల (జుహూ, ఉపభృత్తు మొదలగునవి)కు, మనకుగల సంబంధవిశేషములు, స్త్రీలకు దాయ భాగమెందుకుండగూడదో, స్త్రీలకుమానసికాది వ్యభిచార దోషములచే నెట్టిపరిణామ విశేషములుగల్గునది, ఆయా దోష నివృత్తికుపాయ విశేషములు, ఇత్యాదులు ఇందు గమనింప దగియున్నవి.

6-6 ఈ ప్రశ్నముగూడ పూర్తిగా సోమయాగీయ బ్రాహ్మణమే. సంహిత1-4లో 29నుంచి45వరకుగల అనువాకములలో సోమయాగీయ ఋగ్యజుర్మంత్రములే క్రమములో నున్నట్లే ఈ బ్రాహ్మణమూ క్రమములోనే యున్నది. దక్షిణలస్వరూపము. హెచ్చుతగ్గులను సర్వకొనురీతులు, అవభృథ స్వరూపము, సౌమికచరువు, గర్భశిశువునకు అవయవము లేర్పడురీతి, అందు తల్లిదోషముచే శిశువునకుగల్గుహాని, అట్టి మాతృదోష నివృత్త్యుపాయము, వసంతాది ఋతువులకు మనకుగల ఆధ్యాత్మిక సంబంధము, ఉదకములోనున్న అనేక శక్తివిశేషములు, ఋగ్యజుస్సామాథర్వణ వేదములకు గల పరస్పర సంబంధము ఇత్యాదులిందు గమనింపదగి యున్నవి. ఇంతటితో ఆరవకాండ సమాప్తము.

7-1 ఇక నేడవకాండను పరిశీలింతము. ఇందు మొదటి ప్రశ్నములో రెండనువాకములందు, సోమసంస్థలన్నిటి ప్రకృతి స్వరూప విశేషము ఋగ్యజుస్సామాథర్వణ వేదముల ఏక ప్రయోజనత్వ మూలకమని బోధించు బ్రాహ్మణమున్నది. ఆపైని 3నుంచి10వరకు గల అనువాకములలో, అతిరాత్రము, అంగిరసద్విరాత్రము, గర్గత్రిరాత్రము, ఆత్రేయచతూరాత్రము, జామదగ్న్యచతూరాత్రము, పంచరాత్రము, అనుసంజ్ఞలుగల యాగముల విధులున్ను, అందలి విశేషములున్ను, అందు ఋక్సామవేదముల వినియోగ ప్రక్రియా భేదములున్ను, సహస్రదక్షిణలోగల తాత్పర్యమును ఇత్యాదుల నుపదేశించు బ్రాహ్మణభాగమున్ను, కొద్దిగామంత్రములున్ను గలవు. 11

అనువాకమునుంచి, పన్నముచివరవరకు, అశ్వమేధయాగ సంబంధములగు ఋగ్యజుర్మంత్రములు కలసియున్నవి.

7–2 ఈ పన్నము మొదటినుంచి పదిఅనువాకములలో, సత్రయాగ భేదములగు, షడ్రాత్ర, సప్తరాత్ర, అష్టరాత్ర, నవరాత్ర, దశరాత్ర, ఏకాదశరాత్ర, ద్వాదశరాత్రములను వాటివిధులను ప్రక్రియా విశేషములను బోధించు బ్రాహ్మణమున్ను, కొద్దిగా మంత్రములున్ను కలసియున్నవి. ఆపైని పన్నము చివరవరకు అశ్వమేధయాగ సంబంధములగు ఋగ్యజుర్మంత్రములున్నవి.

7–3 ఈ ఈపన్నములో ఆదినుంచి పదిఅనువాకములలో సత్రయాగ విశేషములగు, అహీనద్వాదశాహ, త్రయోదశరాత్ర, ద్వివిధచతుర్దశరాత్ర, ద్వివిధపంచదశరాత్ర సప్తదశరాత్ర, వింశతిరాత్ర, ఏకవింశతిరాత్రములను యాగవిశేషవిధులు, ప్రక్రియావిశేషముల నుపదేశించు బ్రాహ్మణమున్ను కొద్దిగా మంత్రములున్ను గలవు. సత్రయాగములనగా అనేకమంది యజమానులు కలసి, వారేఋత్విక్కులున్ను యజమానులున్నై యయి, ఒకరోజు అగ్నిహోత్రయాగము, ఇంకొకరోజు దర్శపూర్ణిమాసయాగము వేరొకరోజున అతిరాత్రము ఈ రీతిగా శ్రుత్యుక్త రీతిగా నాచరింపుటయే.

ఆపైన పన్నము చివరవరకు అశ్వమేధములోని ఋగ్యజుర్మంత్రములున్నవి.

7–4 ఈ పన్నమాదినుండి పదకొండనువాకములలో సత్రయాగ విశేషములగు, ద్వివిధచతుర్వింశతిరాత్ర, త్రింశ

రాత్రి, ద్వాత్రింశద్రాత్రి, త్రయస్త్రింశద్రాత్రి, షట్త్రింశ ద్రాత్రి, ఏకోనపంచాశద్రాత్రి, సంవత్సర సత్రములందలి ప్రక్రియా విశేషవిధులున్ను, కొద్దిగా ఋగ్యజుర్మంత్రము లున్నగలవు. ఆ పైని పన్నము చివరవరకు అశ్వమేధ సంబంధి ఋగ్యజుర్మంత్రములున్నవి.

7–5 ఈ పన్నమాదినుండి పదియనువాకములలో, సత్రయాగ విశేషములగు, సంవత్సర సత్రి, పృష్ఠ్యషడహ, గవామయన, అహారుత్సర్గ, ఉత్సర్గిణామయనముల విధివిశేష ములున్ను, "మహావ్రత"మను సార్థకనామముగల యాగ మందలి సామగాన విధివిశేషములున్ను, శతతంతు వీణాగాన విధివిశేషములున్ను, దాసీనృత్యాది విధివిశేషములున్నగలవు.

ఆపైనిపన్నము చివరవరకు అశ్వమేధములోని ఋగ్యజు ర్మంత్రములున్నవి. ఇంతటితో ఏడవకాండసమాప్తము.

ఇట్లు తైత్తిరీయ ~~సంహితా పద~~కాండలతో, 44పన్న ములతో పూర్తికాగా నిక తైత్తిరీయ బ్రాహ్మణము వివరింప బడుచున్నది. అందు మొదటికాండ మొదటి పన్నములో మొదటియనువాకములో సోమయాగ మందలి మంత్ర ములున్నవి. ఆ పైపన్నమంతటిలోను "అగ్న్యాధాన"మను కర్మలోని మంత్రబ్రాహ్మణములున్నవి. వివాహముతో ప్రాప్త మగు ప్రథమస్థాయిలోనున్న "అగ్ని" సమానఫలాధికార యుక్తులగు దంపతులచే ఆరాధింపబడి అంతకంటె ఉన్నత స్థాయిలో అగ్నినారాధింపవలెనను ఇచ్ఛజనింపగా, అపుడా యగ్నిని, "గార్హపత్య, దక్షిణాగ్ని, ఆహవనీయ" ములను

అన్వర్థ సంజ్ఞ గల మూడుస్థానములలో నుంచు కర్మవిశేషమే "అగ్న్యాధాన" మనబడును. ఈ అగ్నితమకు, సర్వజీవులకు, కారణరూపమగు పరదేవతయను భావముతో ఆరాధింప బడును. అట్టిపరదేవ తాత్వమును కలుగజేయు ప్రక్రియా విశేషమే ఈ అగ్న్యాధానము. యజమాని, తన దేహాదికము అవిద్యాకల్పితమనియు, ఈశ్వరత్వమే తన నిజరూపమనియు మంత్రములద్వారా గ్రహించి, తానే ఈశ్వరాభిధానమునొంది తన ప్రాణము నగ్నియందారోపించు చున్నట్లు బోధించు "ప్రజాపతేః త్వా ప్రాణేనాభిప్రాణిమి" అనుమంత్రమే ఇందు ప్రధానమైనది. మిగిలినవన్నియు ఇందులకంగములు— ఈపన్న మందిందుకు సంబంధించిన ఋగ్యజుర్మంత్రములు కొన్ని, బ్రాహ్మణముకొంత, ఆధానయోగ్యనక్షత్రఋతు, సంభారాదులు విధింపబడినవి.

1–2 పన్నమందలి ప్రథమానువాకములో అగ్న్యాధానములోని ఋగ్యజుర్మంత్రములున్ను, 2,3,4, 5అనువాకములందు "గవామయన"మను సత్రయాగమందలి విధివిశేషములు, సామగాన విశేషములు, పశువిశేషములనున్నూ, ఉపదేశించు బ్రాహ్మణమున్నది. 6వ అనువాకమందు "మహావ్రత"మను యాగవిధి విశేషములున్నవి.

1–3 ఈ పన్నమందలి మొదటి యనువాకమందు "పునరాధాన"మందలి విశేషములను విధించు బ్రాహ్మణమున్నది. ఆహితాగ్నికి, ఒకానొకపుడు ఉపాసింపబడు అగ్ని ఉత్పన్నమగుచో, తిరిగి ఆఉపాస్య దేవతయగు అగ్నిని

సంస్థాపించు కర్మయే పునరాధానమనబడును. 2, 3, 4 అనువాకములలో, "వాజపేయయాగ" విధి విశేషములున్నవి. 5, 6, 7, 8, 9 అనువాకములలో వాజపేయయాగీయ మంత్రములయొక్క బ్రాహ్మణమున్నది. అదియు, తై. సంహిత 1కాండ7 ప్రశ్నములో 7, 8. 9, 10, 11, 12 అనువాకములలోనే క్రమముగా, ఋగ్యజుర్మంత్రములున్నవో, ఇందలి బ్రాహ్మణమూ క్రమములో నేయున్నది. పదియవ అనువాకములో "పిండపితృయజ్ఞ" మను హవిర్యాగముయొక్క విధి విశేషములున్నవి.

1-4 ఈ ప్రశ్నమందు సోమయాగములోని బ్రాహ్మణము "సౌత్రామణి"యను హవిర్యాగములోని కొన్ని ఋగ్యజుర్మంత్రములు, నిత్యము చేయు అగ్నిహోత్రయాగములో ప్రమాదవిశేషములచే సంభవించు దోషములకు ప్రాయశ్చిత్త విశేషములు, సోమయాగములో దోషములు సంభవించినచో చేయదగు ప్రాయశ్చిత్తములు, యాగకాలమందు ఇతరకాలమందు, మనస్సునకు శుద్ధికలుగ జేయుకొన్ని ఋఙ్మంత్రములు, "చాతుర్మాస్య"లను సంజ్ఞగల హవిర్యాగములోని, అధికారి, విషయప్రయోజన, సంబంధాదుల నుపదేశించు బ్రాహ్మణమున్నగలదు.

1-5 ఈ ప్రశ్నమందు, వైకృతనక్షత్రేష్టిలోని మంత్రములు, కర్మానుష్ఠాన యోగ్యమగు పుణ్యకాలమును బోధించు బ్రాహ్మణము, సోమయాగ పాత్రలకు యజమానికి గల ఆధ్యాత్మిక సంబంధమును బోధించు బ్రాహ్మణము, కేశవపనమంత్ర

ములు. కేశ, శ్మశ్రు, కక్షాదులలో ఎక్కడముందు వపన మారంభింపవలెనో, ఏయే క్రమముల కేమిఫలమో బోధించు బ్రాహ్మణము, మహాగ్నిచయన ఋగ్యజుర్మంత్రములు, సోమయాగ సంబంధి అంగవిధులు, సోమయాగములో, ఋక్సామవేదముల వినియోగావశ్యకత, కామభేదముచే తద్వినియోగభేదములు ఇత్యాది బ్రాహ్మణమున్నది.

1-6 ఈ పన్నము మొదటిఅనువాకములో రాజసూయ యాగ మంత్రములకను బ్రాహ్మణమున్నది. తైసం.1-8-1లో మంత్రములున్న క్రమములోనే ఈ అను బ్రాహ్మణమున్నది. ద్వితీయాద్యనువాకములలో "చాతుర్మాస్య" యాగమందలి ఋగ్యజుర్మంత్రములకు బ్రాహ్మణమున్నది. తై-సం. 1-8పన్నములో 2 నుంచి 6 వరకుగల అనువాకములలోని మంత్రములున్న క్రమములోనే ఈ బ్రాహ్మణమున్నది.

1-7 ఈ పన్నము మొదటియనువాకములో "చాతుర్మాస్య" యాగ సంబంధి బ్రాహ్మణమున్నది. తై. సం.1-8-7 అనువాకమందలి మంత్రము లేక్రమములో నున్నవో ఈ బ్రాహ్మణ మాక్రమములోనున్నది. మిగిలిన పన్నమంతటిలోను "రాజసూయ" యాగమందలి ఋగ్యజుర్మంత్రములకను బ్రాహ్మణమున్నది- తై-సం. 1-8 పన్నములోని 8 మొదలు 16 వరకు గల అనువాకములలోని రాజసూయమంత్రములే క్రమముగానున్నవో ఇంచుమించు అను బ్రాహ్మణ మాక్రమములో నున్నది.

1-8 ఈ పన్నములో మొదటి నాలుగనువాకములలో రాజసూయ మంత్రముల కనుబ్రాహ్మణమున్నది. తై-సం.1-8

ప్రశ్నములోని 17,18 19,20 అనువాకములలోని ఋగ్యజుర్మంత్ర ములకే క్రమముగా నీ బ్రాహ్మణమున్నది. ఇందలి అయిదవ అనువాకమునుంచి, ప్రశ్నమంతయు "సౌత్రామణి" యాగ మంత్రములకు బ్రాహ్మణ రూపముగానున్నది. తై. సం 1-8 21లోని మంత్ర క్రమములోనే బ్రాహ్మణమున్నది. ఇంతటితో బ్రాహ్మణములోని మొదటికాండ సమాప్తము.

2-1 ఇకను రెండవకాండను పరిశీలింతము. అందు మొదటిప్రశ్నములో "అగ్నిహోత్ర" యాగవిధివిశేషము లున్నవి. ఇది ప్రతిదినము సాయంప్రాతః కాలద్వయమందు వశ్యము చేయదగినదని, ఇందు ఋగ్యజుస్సామాథర్వణ వేదము లన్నిటిమంత్రములును కలసి వినియోగమగునని ఈ అగ్ని సర్వప్రాణిరూపుడని, వసు, రుద్ర, ఆదిత్య, ఇంద్ర, బ్రహ్మాది దేవతలందరును ఇందారాధింపబడుదురని, తన కాయాదేవ తలతోగల నిత్యసంబంధమిట్టిదియని, సువర్ణకారుడగ్నిజ్వాల లోని భేదమును బట్టి, బంగారము కరిగినది లేనిది తెలుసుకొనునట్లే ఈ అగ్నిజ్వాలా భేదమును బట్టి, ఈ అగ్నియందాయా దేవ తలను తెలుసుకొనుటయు, తనకు దేవతా పితృభూతసర్ప పిపీలికా ఓషధ్యాదులకుగల నిత్యసంబంధ పరిజ్ఞానము, అతిథి సత్కారరహస్యము, దేవతలకొనర్చు హోమము, 1. అగ్ని యందు, 2. భూతాదులందు, 3. అతిథులందు, 4. తనయందు చేయుట తద్రహస్యాభిప్రాయము, కామనాభేదము చే హోమ ద్రవ్యభేదములు, అహోరాత్రముల స్వరూపము, తనకు వాటితోగల నిత్యసంబంధము, తన ప్రాణాదివాయువృత్తులకు,

ఇంద్రియవృత్తులకు దీనివలనగలుగు ప్రయోజనము ఇత్యాదు లిందు గ్రహింపబడినవి.

2-2 ఈ ప్రశ్నమందు "హోతృమంత్ర" స్వరూపాదు లున్నవి. సర్వవ్యాపకమైన జ్ఞానమే, బ్రహ్మయను పరదేవత యని ఇత్యాదిగా చెప్పబడుననిన్ని, ఈ జ్ఞానమే, బుద్ధి, సంకల్పము, ఇంద్రియవృత్తులద్వారా కార్యోన్ముఖమైనప్పుడు "ఇంద్రాది దేవత"లనబడుననిన్ని, ఒక్కొక్క ఇంద్రియవృత్తి జరుగుటకెంతెంత ప్రయత్నము ఏ యే దేవతల సంయోగము లోపల జరుగునో దానినంతను బోధించు వేదభాగమునకే "హోతృమంత్ర" ములని సంజ్ఞ- ఇవి వేదోక్త సర్వయాగ కాలములందును, క్రత్వర్థముగాను, ఇతరసమయములందు పురుషార్థముగాను, వినియోగింపవచ్చును- ఈ ప్రశ్నమందు, హోతృమంత్రములులేవు. గాని, వాటివినియోగము, విశేష కామనాభేదముచే వినియోగభేదములు, మొదలగు విషయ ముల నుపదేశించు బ్రాహ్మణమున్నది.

2-3 ఈ ప్రశ్నముగూడ హోతృమంత్ర సామర్థ్య వశ్యాది కామ్యప్రయోగ విశేషాదులను బోధించు బ్రాహ్మ ణమే- జగత్సృష్టి హేత్వాదికి నిందుగలదు.

2-4 ఈ ప్రశ్నమంతయు ఋఙ్మంత్రములతో నిండి యున్నది. శ్రౌత, స్మార్త, నిత్య, నైమిత్తిక, కామ్యాది సర్వ కర్మలందును, శాంతిక పౌష్టిక కర్మలందును ఋగ్వేదీయ ఋత్విక్కగు హోతచేగాక, యజుర్వేదీయ ఋత్విక్కగు అధ్వర్యుని చేతను, యజమానిచేతను వినియోగింపదగినవేగాని

ఇందలి మంత్రములకు ఒకేనియతకర్మ వినియోగము లేదు- వ్యాధి మొదలగు నరిష్టములను శమింపజేయు "కర్మలకు" శాంతికములనియు, దేహపుష్టి మొదలగు నభివృద్ధిని కలుగ జేయు కర్మలకు పౌష్టిక కర్మలనియు సంజ్ఞ-

2-5 ఈ ప్రశ్నముగూడ, పైప్రశ్నమువలెనే సంపూర్ణముగా ఋఙ్మంత్రమయము-

2-6 ఈప్రశ్నములో "కాకిలీసౌత్రామణి" అను క్రతువునుసంబంధించినఋగ్యజుర్మంత్రములుకలసియున్నవి బ్రాహ్మణము లేదు.

2-7 ఈ ప్రశ్నమందు, బృహస్పతిసవము, వైశ్యసవము, బ్రాహ్మణసవము, సోమసవము, పృథిసవము, గోసవము, ఓదనసవము, పంచశారదీయము, అగ్నిష్టుత్తు, ఇంద్రస్తుత్తు, విఘనవము, అను ఏకాహక్రతువులకు సంబంధించిన విధులున్ను, ఆప్తోర్యామమును, సోమసంస్థయొక్కవిధియు, కొన్ని ఏకాహక్రతువులకు సంబంధించిన ఋఙ్మంత్రములున్ను, క్షత్రియునకు రాజాభిషేకమునకు సంబంధించిన ఋగ్యజుర్మంత్రములున్ను గలవు

2-8 ఈ ప్రశ్నమంతయు పూర్తిగా ఋఙ్మంత్రములు-తై. సంహిత 2-1 ప్రశ్నములోనే క్రమముతో కామ్యపశు యాగములున్నవో, వాటికి సంబంధించిన ఋఙ్మంత్రములీ ప్రశ్నములో ఆక్రమములోనే యున్నవి. ఇంతటితో బ్రాహ్మణమందలి రెండవకాండ సమాప్తము.

3-1 ఇక మూడవకాండను పరిశీలింతము - ఈ ప్రశ్నమందాదిలోని మూడనువాకములందు "నక్షత్రేష్టులు"

చాంద్రమసేష్టి, ఉష్టేష్టి, సౌర్యేష్టి, వైష్ణవేష్టి, ఆగ్నేయేష్టి, అనుమతీష్టి అనుసంజ్ఞ గలకామ్యహవిర్యాగములకుసంబంధించిన ఋఙ్మంత్రములున్ను, తరువాత పన్నమంతయు ఆ ఇష్టులకు సంబంధించిన విధివిశేషములతోనొప్పు బ్రాహ్మణమున్ను గలవు

3–2 ఈ పన్నమంతియు దర్శపూర్ణమాసయాగ మంత్రములకు సంబంధించిన బ్రాహ్మణము అందును తై. సంహిత 1–1 పన్నములో ఆదినుంచి 9అనువాకములలో ఏ క్రమమున దర్శపూర్ణిమాసయాగీయ మంత్రములున్నవో, ఆ క్రమముననే ఇందలి బ్రాహ్మణమున్నది.

3–3 ఈ పన్నముగూడ పూర్తిగా దర్శపూర్ణమాసయాగీయ బ్రాహ్మణమయమే. అందును, తై. సం 1–1లో 10, 11, 12, 13అనువాకములలోనున్న మంత్రముల వరుసనే ఇందలి బ్రాహ్మణమున్నది. అచ్చటచట అపేక్షితములగు ఋగ్యజుర్మంత్రములుగూడ గలవు. యజమానియొక్క, ఆసనములయొక్కయు ఆజ్య, ఉదక, యజ్ఞాయుధముల యొక్కయు, సమిధదర్భాది ప్రాపంచిక వస్తువులయొక్కయు వాస్తవ స్వరూప వివరణమిందు గ్రహింపదగినది.

3–4 ఈ పన్నమంతయు "పురుషమేధ" మను సంజ్ఞ గల పంచాహ పాశుకయాగమునకు సంబంధించినది. ఈ క్రతువు ఓజస్సు వీర్యము పూర్ణాయుర్దాయముల నిచ్చునది. ఇందు ఆ యాగములోని ద్రవ్యభేదములను దేవతాభేదములను బోధించు బ్రాహ్మణమున్నది. ఎట్టి మహాపాపములచే, నపుంసక, నట, విట, గాయక, వంది, మాగధాది జన్మలేర్పడునో, ఏయే

మహాపాపములు, ఓజోవీర్యాయుర్నాశ కారణములగునో బోధింపబడుట గమనింప దగినది.

3-5 ఈపన్నమంతయు దర్శపూర్ణమాస యాగము నందును అవి ప్రకృతిగాగల సర్వహవిర్యాగము లందును, "హోత"యను ఋత్విక్కు చెప్పదగిన ఋఙ్మంత్రములతో పూర్తిగానున్నవి. ప్రతిజీవ్రవిలోను ప్రతిక్షణమందును భిన్న భిన్నమగు కర్తృభావమెట్లు మారునదిన్ని, అందులకు ప్రతీకార మున్ను ఇందుగమనింపదగినది.

3-6 ఈపన్నమంతయు "నిరూఢపశుబంధ"ము మొదలగు సర్వపాశుక యాగములందును, ఋగ్వేదీయ ఋత్విగ్గణమగు హోత మొదలగువారు చెప్పదగిన ఋఙ్మంత్రములతో నొప్పియున్నది. పశువులు మొదలగు సర్వజీవుల శారీరక మనఃప్రవృత్తులు, అవయవములపరస్పర సంబంధము, ఒక జీవునకు ఇతరజగత్తుకుగల ఉపకారోపకారకభావము, ఇత్యాదులిందు గమనింపదగినవి.

3-7 ఈ పన్నమందు, అగ్నిహోత్ర, దర్శయాగ, అగ్నిష్టోమాది పాశుకయాగాదులందు సంభవించు ప్రమాదములకు ప్రాయశ్చిత్త ప్రకారముల నుపదేశించు బ్రాహ్మణము, ప్రాయశ్చిత్తమునకు సంబంధించిన ఋగ్యజుర్మంత్రములు అగ్నిష్టోమ దర్శాది యాగములందు యజమాని పఠింప దగినట్టియు అధ్వర్యుడు పఠింపదగినట్టియు, యజమానపత్ని పఠింపదగినట్టియు, "బ్రహ్మ"యను ఋత్విక్కు పఠింపదగినట్టియు మంత్ర విశేషములున్ను గలవు.

(బ్రాహ్మణుడు, అజము, దర్భస్తంభము, ఉదకము, ఇత్యాది సర్వవస్తువులందు అగ్నిసామాన్యమెట్లున్నది, అగ్నివిశేషమెట్లు భేదించినది, మనోవాక్కాయ వ్యాపారముల పరస్పర సంబంధమెట్లుండునది, వీటియందలి శక్తివిశేషములగు దేవతలకు మనకుగల సంబంధవిశేషము, ఏయే కాలమందెట్లుండునది, యాగకాలమందు స్వాభావిక దౌర్బల్యము నెట్లు నిరోధింపదగినది, మహాపాపముల స్వరూపము, తన్నిష్కృత్యుపాయములు, ఇందు గమనింపదగినవి.

3_8 ఈ ప్రశ్నమందు "అశ్వమేధ" యాగమునకు సంబంధించిన బ్రాహ్మణమున్నది. అందు రాష్ట్రప్రజలందరి హృదయములందలి కష్టసుఖములను రాజు గురింపగల్గు నుపాయ విశేషములు, సర్వప్రజలను రంజింపజేయు నుపాయవిశేషములు సకాలమందు వర్షాదులుండి రాష్ట్రము సుభిక్షముగానుండుటకుపాయవిశేషములు ఇత్యాదులు గమనింపదగినవి.

3_9 ఈ ప్రశ్నముగూడ అశ్వమేధయాగ బ్రాహ్మణమే. శ్రౌతస్మార్తకర్మలన్నియు, ఎట్లు చిత్తశుద్ధిద్వారా బ్రహ్మజ్ఞానాధికారమును కలుగజేయునో ఆ విషయమిందు విపులముగా ప్రదర్శింపబడినది.

3_10 ఈ ప్రశ్నమందు "సావిత్రచయన"మను క్రతువిశేషము ప్రతిపాదింపబడినది. తత్సంబంధి ఋగ్యజుర్మంత్రములున్ను, తద్బ్రాహ్మణమున్ను, ఇందుగలవు_ సంవత్సరము శుక్ల, కృష్ణపక్షములందలి, పగళ్ళు, రాత్రులు, పగటియందలి 1/15 భాగములగు ముహూర్తములు, రాత్రియందలి ముహూర

ములు, ఇత్యాదులన్నియు, సర్వజీవులయందలి జ్ఞానవిశేషములే
ని ప్రతిపాదింపబడుట గమనింపదగినది. ఒక పదార్థమును
మనము చూచినట్లుగానుండెడి జ్ఞానము. దానినే ఇంకా మనన
మొనర్చినకొలది గలుగుజ్ఞానములోని భేదములు, మనకొక
ఇంద్రియశక్తి గలుగుటలో, జరుగు విశేషములు, ఇత్యాదు
లుపదేశింపబడి అఖండజ్ఞాన నిత్యత్వమందు సాధింపబడుట
గమనార్హము. భరద్వాజుడను మహర్షి మూడుపురుషాయువుల ద్వా
రమునను తపశ్శక్తిచేపొంది వేదాధ్యయనమొనర్చినను వేదము
లనంతములుగాన, అతిస్వల్పభాగము మాత్రమే పొందెననియు
ఈ అఖండజ్ఞానముచే సంపూర్ణ వేదవేత్త ఆయెననియుబోధించు
ఆఖ్యాయిక వలన పై అర్థము బోధింపబడుచున్నది.

3_11 ఈ పన్నమ "నాచికేతచయన" మను క్రతు
విశేషము నుపదేశించుచున్నది. ఇందుకు సంబంధించిన ఋగ్య
జుర్మంత్రములున్ను, బ్రాహ్మణమున్ను గలదు. పంచభూత
ముల స్వరూపమగు, శబ్దస్పర్శరూప రసగంధములును, వచనా
దానగమన విసర్గానందములును, సర్వదేహములందును, ఉండు
టలో, ఎన్ని అవాంతర భేదములతోనున్నదియు, అనగా ప్రతి
దేహమందును, ఎన్నిశబ్దభేదములున్నవో, ఎన్నిరూపభేదము
లున్నవో వాటికి కారణభేదములెన్నియో వివరించుచు వీటి
యన్నిటిలోను సమానముగా నుండుజ్ఞానమును నిరూపించుట
ఇందు గమనింపదగినది. అట్టి జీవులుకారని లోకసామాన్య
ముచే తలంపబడు సువర్ణాదులందెట్టిరీతిలో జీవత్వమున్నదో
నిరూపించుటకూడ ఇందు గమనార్హము. సూర్యమండల

మునకు పైనున్న లోకములును తద్గత విశేషములును, మనకు వాటికిగల సంబంధ విశేషములును, ఇందు బోధింపబడినవి. అతిథిసత్కార రహితులగు గల్గు అనర్థపరంపర నుపదేశించుట ద్వారా, సర్వజీవులందును ఏకరీతిగానుండు ఆత్మనస్వరూ పింపబడినది. ప్రతియాగమందును అగ్నియందు హోమము చేయుటతోపాటు యజమాని తనయందుగూడ అవశ్యము హోమమొనర్చి తీరవలెనని బోధించుటద్వారా, అగ్న్యాది సర్వదేవతలును తన ఆత్మమూలకమైనవారే ననుజ్ఞానమును గలుగజేయుచున్నది.

3-12 ఈ పన్నమందు "చాతుర్హోత్ర చయనము-" "వైశ్వసృజచయనము" అను క్రతువిశేషములున్నూ, అందుకు సంబంధించిన ఋగ్యజుర్మంత్రములున్నూ తద్వ్యాఖ్యానములుగల బ్రాహ్మణమున్నూ గలదు. కొన్ని ఋఙ్మంత్రముల మొదళ్ళు మాత్రముదహరింపబడిగూడ యున్నవి. ఆ పూర్తిమంత్రములు కూడ లోగడనే బోధింపబడినవి. "వైశ్వసృజచయనము"న కంగభూతములగు కొన్ని ఇష్టులిందున్న — వాటికి "దివశ్యేనీ-అపాద్యలు" అనిసంజ్ఞ — కామము, ఆశ, అనుమతి, యజ్ఞము, అనువిత్తి, తపస్సు, శ్రద్ధ, సత్యము, మనస్సు, చరణము, బ్రహ్మ ఇత్యాదిపదముల సంపూర్ణ తాత్పర్యము, ప్రతిజీవునియందు వీటి స్థితి, ప్రతివాదు, వీటియభివృద్ధికి చేయదగిన ప్రయత్నవిశేష ములు, ఇందు వివరింపబడినవి. సర్వస్త్రీపురుషులందు, సర్వ భూమండలమందు, సర్వపశువులందు, సర్వఉదక బిందువులందు సర్వఓషధీవనస్పతులందు, గ్రామ్యారణ్య, ద్విపాచ్చతుష్పదా

దిగ్వ్యాపకులందు, సువర్ణ రజత తామ్రాదిలోహము లన్నిటి యందు ఆకాశవాయు తేజస్సలిల పృథివ్యాది సర్వభూతములందు, ఏ జ్ఞానము నిత్యముగాను అనంతముగాను, ఆనందముగాను ఏకరీతి గానున్నదో అట్టిజ్ఞానమే ఇందు ఇష్టకోపధాన మంత్రము లందిమిడియుండుట గమనింపదగినది.

ఇంతటితో బ్రాహ్మణము సమాప్తము. ఇక ఆరణ్యకము పరిశీలింపబడుచున్నది.

1 ఈపన్నములో "అరుణకేతుకచయన" మను క్రతు విశేషము అందుకు సంబంధించిన ఋగ్యజుర్మంత్రములు, తద్బ్రాహ్మణము, అందుకు సంబంధించిన దేశకాలవినియోగాదులన్నియుగలవు. ఖగోళవిశేషములు భూలోకవాసులందరకు ఖగోళస్థులతోగల నిత్యసంబంధ విశేషములు, సంవత్సరము ఋతువు మొదలగు కాలమానములన్నిటికి ఉపపత్తులు, వాటి పుష్కలస్వరూపము, విద్యుత్తు, స్తనయిత్ను మొదలగు వాటిస్వరూపాది విశేషములు, సూర్యునిస్వరూపాదులు తదవాంతర భేదములు, సర్వజీవులకు సూర్యునితోనున్న సంబంధము, మృత్యుస్వరూపము, తన్నివృత్తి కుపాయములు, వాగ్దేవతాస్వరూపము, శబ్దార్థములకుగల నిత్యసంబంధమున కుపపత్తులు, వృష్టిస్వరూపము, తన్నిమిత్తములు, తత్ప్రక్రియా విశేషములు, అహోరాత్ర, ఉష్మ, నీహార, ఆతప, ఛాయాది సర్వప్రకృతి విశేషములయొక్క, హేతువులు, స్వరూపములు, ప్రయోజనములు, ప్రసిద్ధులగు ఋషులు, వారిస్వరూపాదులు, వారికి సర్వజీవులకుగల సంబంధములు, ప్రసిద్ధులగు దేవతలు,

వారి స్వరూపాదులు, సర్వజీవులకు గలిగియుండు సంబంధములు, పుణ్యలోక పాపలోకములయొక్క స్వరూపాదులు, సృష్టి ప్రక్రియ, సర్వజీవులకు మనస్సుండుటకు హేతువు ఈశ్వర నారాయాది మనోవ్యాపారము లన్నిటికి నిమిత్తములు, ఆచరించుచున్న స్థితిలోనుంచి పుణ్యపాపములెల్లు ఎన్ని పరిణామములను పొందుచూ చివరకాజీవ్రున కనుభోగ్య మగునదిన్ని ఇత్యాది విశేషములిందున్నవి. ఈ ప్రశ్నమునకు "అరుణ" మని వ్యవహారమున్నది.

ఆరణ్యకం 2ప్రశ్నమునకు "స్వాధ్యాయబ్రాహ్మణ"మని ప్రసిద్ధవ్యవహారమున్నది. ఇందు మొదటి అనువాకమందు యజ్ఞోపవీతవిధియు, తత్ప్రాశస్త్యమును, తదావశ్యకతయు, దేవ, పితృ, మనుష్యకార్యము లందద్దానియొక్క సంబంధవిశేషములున్నూ గలవు. 2వ అనువాకమందు సంధ్యావందన విధిగలదు. ప్రతిజీవుడును వాస్తవముగా నిత్యశుద్ధ జ్ఞానరూప మగు బ్రహ్మమేయైనను, అవిద్యచే అనిత్యాది రూపుడనను తలంపును తొలగించుట కుపాయమే సంధ్యావందనమను విషయమ్ము గ్రహింపదగినది.

3నుంచి9వరకు అనువాకములలో "కూశ్మాండహోమ" మంత్రములున్నవి. సర్వకర్మలకు ఆరంభమందున్ను, యజమానికి పాపక్షయముద్వారా కర్మాధికారసిద్ధికొఱకున్ను, ఇతర కాలములందుగూడ ఎప్పుడుతనకు దుర్బుద్ధియున్నట్లు తోచునో, అప్పుడు ప్రాయశ్చిత్తద్వారా పరిశుద్ధత నపేక్షించునో, జీవుడద్దానికి సాధనమే ఈ కూశ్మాండహోమములు ఇందు 13యజుర్మంత్రములున్ను 51ఋఙ్మంత్రములున్న

మొత్తం 64 గలసి ఒకే వినియోగము నొందుచున్నవి. ఇందొకవిశేషము గమనింపదగియున్నది. ఈ ప్రకరణమంతయు ఋఙ్మంత్రములతో నిండియున్నది. వాటిమధ్య 13 యజుర్మంత్రములయొక్క మొదళ్ళుమాత్రము ఉట్టంకింపబడినవి. ఈ యజుస్సుల పూర్తిపాఠము, తై. బ్రా 3–7–12లో నున్నది. ఇట్లే ఋగ్వేదములో మధ్యమధ్య యజుర్వేదీయ మంత్రముల మొదళ్ళుమాత్ర ముట్టంకింపబడుటయు, వాటి పూర్తిపాఠము యజుర్వేదమందుండుటయు, వరశ్శతములుగలవు. ముందు ద్వితీయాది సంపుటములలో ఋగ్వేదములోని సర్వవిషయములను అనుక్రమముగా సూచించునపుడవన్నియుస్పుటముగా పాఠములకు గోచరమగును. ఋగ్యజుర్మంత్రములకు విడివిడిగా వినియోగములేకుండ ఒకే వినియోగముండుట ఈ రెండు వేదములు ఏకకాలమందే యున్నవను భారతీయ వాదమునకు బలమో, రెండు వేదములున్ను భిన్నభిన్న కాలములందు వ్రాయబడినవను పాశ్చాత్యవాదమునకు బలమో విచారించి నిర్ణయించుకొనుభారము పాఠకులకేగలదు.

ఈ కూశ్మాండహోమ మంత్రములలో కరచరణాది దేహావయవములన్నిటిద్వారా, చేసియున్నట్టియు చేయుచున్నట్టియు ముందు చేయబోవునట్టియు దోషములున్ను, తద్విస్తరములగు దేవతానింద, అనృతవదనము, వడ్డీవ్యాపారాధులు, జూదమాడుట, దొంగతనము, మొదలైనవిన్ని, తత్తద్దోషనివారకరులగు నాయా క్రియాశక్తిరూపులగు దేవతలున్ను వివరింపబడియున్నవి – 7, 8 అనువాకములలో ఈ కూశ్మాండహోమ

విధివిశేషములున్న, నియమాదులున్న గలవు- 9 నుంచి 15 వరకుగల అనువాకములలో ప్రతిదినము అవశ్యకర్తవ్యము లగు పంచయజ్ఞము లుపదేశింపబడినవి. 1. దేవయజ్ఞము, 2. పితృయజ్ఞము, 3. భూతయజ్ఞము, 4. మనుష్యయజ్ఞము, 5. బ్రహ్మయజ్ఞము, అని ఈ ఐదు. వీటియొక్కటికి "వైశ్వదేవ"మని గూడ లోకవ్యవహారమున్నది. ఈ విషయము విపులముగా "వైశ్వదేవమీమాంస" యను నాచే రచింపబడిన గ్రంథములో విచారింపబడినది.

వేదాధ్యయనము, అర్థగ్రహణము, మననము, తదుచితాచరణము, ఇవియే ప్రతివానికి సకలపురుషార్థములను కలుగజేయుననుట ఇందు ప్రధానవిషయము. ఇంతవరకు మన మీ వ్యాసమందు తెలుసుకొన్న విషయములనుబట్టియే వేదము యొక్క ప్రాశస్త్యము గోచరమగుచున్నది. ఇందే యొక విషయమునైనను మనుష్యబుద్ధిలో నూహింపశక్యము గాదనుట నిర్వివాదము— కావుననే ఇందలి "యదీగ్ం శృణోత్యలకగ్ం శృణోతి" యనువాక్యము వేదాతిరిక్తమగు ఎట్టిమతములలను ఎట్టి పురుషార్థలేశముగూడ ఉండదను సింహగర్జన మొనర్చుచున్నది.

ఈపన్నమందలి 16 అనువాకమునుంచి కొన్నిదోషములకు ప్రాయశ్చిత్తముగా వేదపారాయణ, విధివిశేషములు బోధింపబడుట, బ్రహ్మచర్యాశ్రమనియమభంగమందు చేయదగిన ప్రాయశ్చిత్తము, సాయంకాలిక సంధ్యావందనానంతరము ధ్రువమండలమందు పరబ్రహ్మభావ స్థాపన మొనర్పదగు

మంత్రాదులు, సంధ్యావందనాంగములగు దిగ్దేవతోపస్థాన మంత్రములు ఒకమారు పూర్తిగా వేదపారాయణ మొనర్చుటకెంతకాలము పట్టునో, అంతకాలము నిరంతర గాయత్రీ జప మొనర్చిన వానికి వేదపారాయణ తుల్యఫలమువచ్చునను (బ్రాహ్మణము ఇత్యాదులున్నవి.

3. అరణ్యకము మూడవ ప్రశ్నమునకు "చితిప్రశ్న"మని వ్యవహారమున్నది ఇందు "చాతుర్హోత్రచయన"మను క్రతువులో నుపయోగించు మంత్రములున్ను, (వీటివినియోగాదులున్ను, బ్రాహ్మ 3-12లో నున్నవి) చాతుర్మాస్య యాగమందు కేశవపనానంతరమందు, యజమాని జపింపదగు మంత్రములున్ను, సర్వసోమయాగములందును యాగీయ ద్రవ్యసంభరణార్థకములగు కొన్ని మంత్రములున్ను, దేవపత్నీనామములున్ను ప్రతిగ్రహమంత్రములున్ను, అందును ద్రవ్యభేదముచే గల్గు దేవతాభేదమును, సచ్చిదానంద లక్షణమగు "ఆత్మ"ఒకటే సమస్తజగత్తునకున్ను అధిష్ఠానమై నిజరూపమై యున్నదను నర్థమును బోధించు, దశహోతృహృదయ, చతుర్హోతృహృదయ, పంచహోతృహృదయ, షడ్ఢోతృహృదయ, సప్తహోతృహృదయములను సంజ్ఞగల ఋగ్యజుర్మంత్రములున్నుగలవు. దశహోత్రాది మంత్రములు సర్వశ్రౌత, స్మార్త, కర్మలందును చెప్పబడును. తై. బ్రా 2-2ప్రశ్నములోను, 2-3ప్రశ్నములోను వీటిప్రశంసాదులున్నట్లు లోగడనే వివరింపబడినది. అన్నికర్మలకును అంగములగు ఈ "హోతృ"మంత్రములయొక్క సర్వము తాత్పర్యము నుపదేశించు వేదభాగమే "హోతృహృదయ"

మనబడును. గాన సర్వకర్మలున్ను అద్వైత ఆత్మజ్ఞానమునందే పు ష్క ల తాత్పర్యమనుట సిద్ధివాదము.

ఇంకను ఈ పన్నమందు "పురుషసూక్తము" అను లోకవ్యవహారముగల ఋగ్వేదీయ మంత్రములు రెండనువాక ములలో నున్నవి. సర్వప్రాణి సమిష్టిరూపుడున్ను బ్రహ్మాండ దేహుడున్ను అగు విరాట్పురుషుని స్వరూపాదిక మిందున్నది. మహాగ్ని చయనాదులందిద్దాని వినియోగము. ఆపైన ఈ పన్నమందే అపమృత్యు నివారకమగు హోమకయాగమునకు సంబంధించిన ఋఙ్మంత్రములున్నవి. ఆపైని మృత్యుసూక్తము మొదలగు కొన్ని ఋగ్యజుర్మంత్రములున్నవి. ఈ పన్న మంతయు "బ్రహ్మమేధ" మందు వినియోగమగును. తృతీయ స్థాయిలోని అగ్నినుపాసించుచు మరణించిన వారికి చేయు ఔర్ధ్వదేహికకర్మయే బ్రహ్మమేధమనబడును. అనగా వారి దేహమును వారి ఉపాస్య దేవతయందు లయింపజేయుటయని భావము.

4. ఆరణ్యకము నాల్గవపన్నములో "ప్రవర్గ్య"అను క్రూరకర్మలోని మంత్రములున్నవి. ప్రతిసోమయాగములోను రాత్రిసబాధాని వృత్తిద్వారా యజ్ఞమునకు శిరస్సంధానముకొరకు ఆచరింప దగినదే — ఈ "ప్రవర్గ్య"—యాగ మొనర్చు యజ మానియొక్క మనః ప్రవృత్తియే యజ్ఞమనబడును. ఈ ప్రవృత్తిని ఆత్మయందు లీనమొనర్చుటయే "యజ్ఞశిరస్సంధా నము"లోని తాత్పర్యము.

5. ఆరణ్యక మైదవప్రశ్నమునకు ప్రవర్గ్య బ్రాహ్మణమని సంజ్ఞ – పైనాల్గవ ప్రశ్నములో ప్రవర్గ్యము సంబంధించిన ఋగ్యజుర్మంత్రము లేక్రమములోనున్నవో, ఆక్రమముననే ఇందు వాటి బ్రాహ్మణమున్నది.

6. ఆరణ్యక మారవప్రశ్నమునకు "పితృమేధ"మని సంజ్ఞ – మరణించిన గృహస్థులకు చేయుదగు ఔర్ధ్వదేహిక సంస్కారమునకు సంబంధించిన ఋగ్యజుర్మంత్రములిందున్నవి. అందును ప్రథమస్థాయిలోని అగ్నినుపాసించుచు మరణించిన వారి నా స్థాయిలోని అగ్నియను ఉపాస్యదేవతలో లయ మొనర్చుటయున్ను, రెండవస్థాయిలోని అగ్ని నుపాసించుచు మరణించినవారి నా ద్వితీయస్థాయిలోని అగ్నియను ఉపాస్య దేవత లోలయమొనర్చుటయున్ను, ఈ పితృమేధములోని తాత్పర్యము, ఇకముందు నాలుగుప్రశ్నములకును "ఉపనిషత్తు" లని సంజ్ఞ.

ఉపనిషత్తు

7 అందు అరణ్యక మేడవప్రశ్నమునకు సాంహిత్యుపని షత్తని పేరు. 1. పూర్వపదము, 2. ఉత్తరపదము, 3. ఈ రెంటి సంధి, 4. దీనిచే పదద్వయమున కేర్పడు అన్యోన్యసంధానము అను నీ నాలుగవయవము లున్నదే ఏకవాక్యమగును. సమస్త వేదమునకును ఇట్టి ఏకవాక్యతగలదు. అద్దానిని నిశ్చయించుటకున్ను, అట్టివేద వేద్యముకంటె జగత్తులోనెద్దియు భిన్నము గాదని నిశ్చయించుటకొరకున్ను, పై నాలుగవయవములందును లోకోపాసన, జ్యోతిషోపాసన, విద్యోపాసన, ప్రజోపాసన, అధ్యాత్మోపాసన లిందుపదేశింపబడినవి. దీనికి ఫలము ప్రజా

పశు, బ్రహ్మవర్చస, అన్నాద్య, స్వర్గలోకముల ప్రాప్తిద్వారా బ్రహ్మజ్ఞానసాధనమగు చిత్తైకాగ్ర్యముగల్గుట శరీరపాటవ అశనా, చ్ఛాదనామేధాది రహితులకిట్టి చిత్తైకాగ్ర్యమునకు ప్రతిబంధక మేర్పడుసుగాన, మేధాదిసిద్ధిప్రదములగు కొన్ని మంత్రము లిందుపదేశింపబడినవి. ఆ పైని అంగదేవతల నుపాసించురీతులున్న, తమహృదయాకాశమందుండి, అంతరింద్రియ బహిరింద్రియప్రేరకుడై ఇంద్రియ వృత్తిరూపము నొందుచున్నట్టియు, పై అంగదేవతలకు అంగియగునట్టియు బ్రహ్మయొక్క ఉపాసనారీతి మధ్యమాధికారులకొరకు ప్రవర్తింపబడినది. అంతకంటెతక్కువ అధికారులకొరకు ఇంద్రియగమ్యగుణోపేతమగు బ్రహ్మయొక్క ఉపాసన బోధింపబడినది. ఉత్తమాధికారులకొరకు వేదాంత వేద్యమగు శుద్ధ బ్రహ్మోపాసన బోధింపబడినది. ఇదంతయు ఆముష్మిక సాధనముగాన తత్సహకారులగు, ఋత, సత్య, తపో, దమ, శమ, అగ్నిహోత్ర అతిథి, సత్కారాదులను, వేదబోధితరీతిగా అవశ్యమాచరింపవలెనని బోధింపబడినది. వీటియన్నిటిలోను వేదాభ్యాసమను బ్రహ్మయజ్ఞ మత్యంత ప్రధానమైనదనియు, ప్రజ్ఞామాంద్యాదులచే వేదభ్యాసాభావమందు, సంపూర్ణ బ్రహ్మయజ్ఞ ఫలసిద్ధిప్రదమగు మంత్రముపదేశింపబడినది. ప్రతిజీవుడును వాస్తవముచే సచ్చిదానందలక్షణమున్న నిత్యశుద్ధబుద్ధముక్త స్వభావమున్న అగుబ్రహ్మయేయనియు, అద్దానియందవిద్యచే, దేహాదిజగత్తంతయు, కల్పితమైనదనియు ఆ మంత్రతాత్పర్యము—

ఇట్లు అరజ్ఞానసహితమున్ను, ఉక్తోపాసనా సహితమున్నుఅగు వేదోక్తకర్మాచరణము క్రియుముక్తి హేతువగునని నిరూపించి, అంతకంటె తక్కువ అధికారముగలవారొనర్చు కేవలకర్మలు, చిత్తశుద్ధిని, వివిదిషను కలుగజేయుటద్వారా మోక్షసాధన మగునని బోధింపబడినది— బ్రహ్మచారి గురుకులమందు వేదాధ్యయన మొనర్చి తనగృహమునకు తిరిగిపోవునపుడు గురువుప దేశించు ధర్మానుశాసన మీావన్నమం దేయున్నది. "సత్యవదనము ధర్మాచరణము, వేదాభ్యాస, తదర్ధజ్ఞాన, తదుదిత ధర్మాచరణ, తత్ప్రచారముల ఆవశ్యకత, మాతాపితృగురు అతిథ్యాదులను నిత్యము పూజించుట, దేవర్షి పితృకార్యముల నాచరించుట," ఇత్యాదులిందు ప్రధానములు.

8. అరణ్యకము యెనిమిదవ వన్నమందు బ్రహ్మవిద్య పుష్కలముగా వివరింపబడినది. బ్రహ్మ సజాతీయ విజాతీయ స్వగతభేదములులేనిది. దేశకాల వస్తుపరిచ్ఛేదతలు లేకఅనంత మైనది,జ్ఞానరూపమైనది. ఆనందమే దానిస్వరూపము. దీనికంటె భిన్నముగా ఎట్టిజగత్తున్ను లేదు. దీనినిగుర్తించక అన్నమయ ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయములను అయిదుకోశములచే ఆవృతుడై జీవ్రుడనబడుచు, జననమరణ ప్రవాహ రూపమగు సంసారము నొందుచున్నాడు. అందు ఆయా విషయముల ననుభవించుటయే ఆనందమయకోశము. భోక్తృత్వము కర్తృత్వమూలకముగాన, కర్తృత్వమే విజ్ఞానమయకోశము. ఇందుకు సాధనమగు అంతఃకరణభాగమే మనోమయకోశము. మనస్సులోని కామ సంకల్పాదులను

ఆయా ఇంద్రియములలోనికి ప్రసరింపజేయుటయే ప్రాణమయ కోశము. ఇన్నింటికి ఆశ్రయమగు ఈ దేహామే అన్నమయ కోశము. ఇట్టి అయిదుకోశములున్ను అసత్య, జడ, దుఃఖ, పరిచ్ఛిన్నరూపములైనను, ఆత్మ సర్వవ్యాపకముగాన, ఇవి తమతమ వ్యాపారములోనర్చుట ఆత్మమూలకమే యగుచున్నది. అంతఃకరణాది సాధనములున్ను కర్తృత్వ భోక్తృత్వ ములున్ను, ఒకపుడుండి మరియొకపుడుండకపోవుట సర్వ లోకానుభవసిద్ధమైనందున, తాను పంచకోశాతిరిక్తుడును, అకర్తయు అభోక్తయునగు బ్రహ్మయే యగుచున్నాడు. ఇట్టి జ్ఞానరూపుడైయుండుటయే బ్రహ్మభావము లేక మోక్షమన బడును. ఇదీపన్నమందలి శ్రవణప్రకరణము.

ఇకను మననప్రకరణముగూడ నిందుగలదు. ఇట్టిబ్రహ్మ లేనేలేదని తలచువారే లేనివారగుదురు. బ్రహ్మయున్నపుడే తానుండును. అట్లైనచో, సర్వాలు బ్రహ్మయేయైనచో, విద్వాంసుడు,అవిద్వాంసుడు అను భేదమునకుగాని, వీరికిగల్గుఫల ములో భేదమునకుగాని హేతువులను వివరించుటకొరకు సృష్టి ప్రక్రియఇందే ఇట్లుగలదు. ఈబ్రహ్మయే బహురూపమగు జగత్తుగా కావలెనని సంకల్పించెను — ఆత్మాశ్రితమగు మాయాశక్తియే, సంకల్పరూపమగు విక్రియనొందెను. వెంటనే ఈ స్థావర జంగమాత్మకమగు జగత్తంతయు ఏర్పడెను. ఇంత జగత్తును, బ్రహ్మతో పోల్చినపుడతిస్వల్పమేయగును— మన జ్ఞానముకంటె మనదేహము చిన్నదనుట సార్వజనీనముగదా! ఇట్లుసృజించిన జగత్తులో తానను ప్రవేశమొనర్చెను. మన

దేహవ్యాపారాదు లన్నిటిలోను మనజ్ఞానమనుప్రవేశించి యుండుట సర్వజనానుభవసిద్ధమేగదా! ఇట్లు ప్రవేశ మొనర్చిన బ్రహ్మమే, పృథివ్యప్తేజో వాయ్వాకాశాది భూతరూపమున్ను ఘటపటాది నిర్వచనయోగ్య వస్తురూపమున్ను, ఇక్షుక్షీరాదుల మాధుర్యావాంతర భేదమువలె నిర్వచన మొనర్పజాలని వస్తురూపమున్ను, పుష్ప, గుడాద్యాధార రూపమున్ను గంధరసాద్యాధేయ రూపమున్ను, ఇదియదియన నేల! సర్వజగద్రూపమాయెను. ఇట్లు స్వయముగా జగదాకారము నొందినందువల్లనే ఈ బ్రహ్మకు "సుకృత"మనిసంజ్ఞ. మనకండరకు, జ్ఞానమే, ఆయా ఆకారములనొందుట ప్రత్యక్షమేగదా!

ఇట్లు స్వయంకర్తృత్వ ప్రసిద్ధివలన బ్రహ్మ ఉన్నట్లు ఋజువగుచున్నది. ఇంతేగాక, రసరూపప్రసిద్ధికూడ మరియొక హేతువగును. రసము, తృప్తి, ఆనందము ఇత్యాదులు పర్యాయ పదములు- గృహక్షేత్ర ధనపుత్ర కళత్రాదులకంటె తానే తనకెక్కువ ఆనందపాత్రమనియు, గృహాదులందలి ప్రేమ తన కొరకేగాని గృహాదుల కొరకెంతమాత్రముగాదనియు, ఆపత్సమయాదులందు గృహాదులనుత్యజించియైనను తానానందించుటయు, సర్వలోకప్రత్యక్షముగదా! ఇట్టి ఆనందమే లేనిచో ఎవడు జీవింపగలడు? ఇతరులనానందింపజేయు వాడానందరూపుడుగాక మరేమగును? గాన చక్షురాదీంద్రియముల కగమ్యమును, అనుమాన (ఊహ) ప్రమాణాతీతమును, శబ్దాదులచే చెప్పనలవి గానిదిన్ని, అనాధారమున్ను అగునీఆత్మయే (తానే) బ్రహ్మయని గుర్తించిన విద్వాంసునకభయము (మోక్షము)న్ను, తా

నొకడు బ్రహ్మ మరియొకడు అని గుర్తించిన ఆ విద్వాంసునకు భయము, లేక జననమరణాది సంసారబంధమున్ను గల్గును.

ఇంతేగాక, వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, మృత్యువు మొదలగు దేవతలందరును, ఈ జ్ఞానరూపమగు బ్రహ్మవల్లనే నియతముగా తమతమ వ్యాపారములందు ప్రవృత్తులగుచున్నారు. ఇట్టి ఆనందము ఉపాధిభేదముచే భిన్నముగా భాసించుచున్నది. యౌవనవంతుడై, సమస్తవిద్యాపారంగతుడై సత్ప్రవర్తనగల్గి, ధనధాన్యములతో తులదూగు సమస్త భూమండలమునకు ఏకఛత్రాధిపతియగు సార్వభౌముని యానందమే మనుష్యానందము. దీనికంటె నూరేసిరెట్లు ఉత్తరోత్తరోత్కృష్టములు, మనుష్యగంధర్వ దేవగంధర్వ, పితౄణాంచిరలోకలోక, ఆజానజదేవ, కర్మదేవ, దేవ, ఇంద్ర, బృహస్పతి, ప్రజాపతి, బ్రహ్మానందములు—అట్లైన, బ్రహ్మానంద మెంతటిదో నూహింపశక్యమగునేమో! ఇన్ని ఆనందములను, ఇచటనే యుండి వేదోపదేశములనన్నిటిని యథావిధిగా నాచరించి జ్ఞానియైనవాడు పొందనర్హుడు— ఇట్టివాడు క్రమముగా అన్నమయాదికోశములందు తాదాత్మ్యాభిమానమును పరిత్యజించి, కర్తృత్వ భోక్తృత్వ పుణ్యపాపవివర్జితుడై నిత్యజ్ఞానానందరూపమగును— ఇదియే మోక్షమనబడును.

ఆరణ్యకము 9 పన్నములో, పై బ్రహ్మవిద్యకు అంతరంగసాధనము లుపదేశింపబడెను. భృగువనువాడు తండ్రియగు వరుణుని యథావిధిగా బ్రహ్మవిద్య నుపదేశింపమని ప్రార్థింపగా, నాతండ్రి అతనికి అన్నప్రాణ చక్షుశ్శ్రోత్ర మనో

వాక్యములద్వారా బ్రహ్మను తెలుసుకొనుమనియు "దేనివలన సమస్తజగత్తు పుట్టుచున్నదో, "దేనియందు సమస్తజగత్తుస్థితి నొందియున్నదో, దేనియందు సమస్త జగత్తులయించునో- అదియే బ్రహ్మ" యనులక్షణమునున్ను బోధించెను. అంతట నా భృగువు, బ్రహ్మచర్యగార్హస్థ్య, వానప్రస్థ, సంన్యాసములను నాల్గుత్రశ్రమ ధర్మములను సమన్వయ పరచుకొనుచు, క్రమముగా అన్నప్రాణ మనోవిజ్ఞానములేల బ్రహ్మకావో తెలుసుకొనుచు ఆనందమే బ్రహ్మయని నిశ్చయించెను. కావున బ్రహ్మవిద్యలో గురుశిష్యు లిట్లుండవలెననియు,1 వేదాధ్యయనము బ్రహ్మచారి తపస్సున్ను, 2. వేదోక్తధర్మాచరణము గృహస్థతపస్సున్ను, 3. అనశనాదిరూప వానప్రస్థతపస్సున్ను, 4. అంతర్బహిరింద్రియైకాగ్ర్యమను సంన్యాసి తపస్సున్ను ఈ నాల్గు విధములైన తపస్సున్ను, బ్రహ్మవిద్యకంతరంగ సాధనములనియు దీని తాత్పర్యము. దీనిబట్టి సమస్త వేదమున్ను ఏకవాక్యతనొందుచున్నది.

ఈ పన్నమందు మధ్యమాధికారులకొరకు కొన్ని ఉపాసన లుపదేశింపబడి, చివరకు, బ్రహ్మవేత్తయొక్క ఆనందానుభవముతోను, సర్వభావావత్తితోను ఉపసంహరింపబడినది. ఇందును ఋగ్యజుస్సులుకలసియేయున్నవి.

ఈ 8-9పన్నములకు "వారుణ్యుపనిషత్తని సంజ్ఞ- 10 ఆరణ్యకము పదియవపన్నమునకు "యాజ్ఞిక్యుపనిషత్తని సంజ్ఞ. ఇదియే తైత్తిరీయశాఖలోని చివరిపన్నముగాన, ఇందు సర్వవిషయములు సింహావలోకన మొనర్పబడినవి - బ్రహ్మ

లక్షణములగు సత్యజ్ఞాన అనంత ఆనందాదులను ఋగ్యజు ర్మంత్రములతో వివరించుట, అంతర్యామిగా సర్వజీవులందు నుండి బుద్ధ్యాదులను ప్రవర్తింపజేయునట్టి ఈశ్వరునుపాసించు టకు కొన్నిమంత్రములు, ప్రతిదినము స్నాన మొనర్చునపు డుచ్చరింపదగు ఋగ్యజుర్మంత్రములు, స్నానానంతరమందు జపింపదగు మంత్రము, అనిష్టపరిహారార్థము జపింపదగు ఋఙ్మంత్రములు, అన్నసమృద్ధి మొదలగు కోరికలను నెరు వేర్చుట కుపకరించు హోమమంత్రములు, పావిత్ర్యార్థక మగు హోమమంత్రములు, జ్ఞానప్రతిపాదక కృత్స్న వేదాంత ప్రాప్తిని కోరువాడు జపింపదగుమంత్రము, పొందబడిన విద్య మరవకుండుటకొరకు జపింపదగుమంత్రము, జ్ఞానసాధనమగు చిత్తైకాగ్ర్యత నపేక్షించువానిచే జపింపదగు మంత్రము, వేద బోధితమగు తమతమ వర్ణాశ్రమధర్మమే జ్ఞానసాధనమనియు తద్విరుద్ధమైనది జ్ఞానప్రతిబంధక మగుననియు బోధించు బ్రాహ్మణము, తిరిగి బ్రహ్మలక్షణములను వివరించు ఋఙ్మం త్రములు, ప్రతివాడును తమహృదయ పుండరీకమందే ఉపా సింపదగు ఈశ్వరునిగూర్చిన విశేషాదుల నుపదేశించు ఋఙ్మం త్రములు, ఉపాస్య దేవతా నమస్కారార్థకమగుఋఙ్మంత్రము, ఆదిత్యమండలమందు బ్రహ్మోపాసన చేయురీతి, ఉపాస్య బ్రహ్మలక్షణము, ఉపాసనాఫలము, అట్టిఉపాసన చేయలేని వాడుజపింపదగిన ఆదిత్యమంత్రము, రుద్రదేవత నుపాసించుట కనువగు మంత్రములు, అగ్నిహోత్రాది కర్మలందుపయో గించు పనిముట్లకర్తృమగు వ్యక్తివిశేషము నుపదేశించు

బ్రాహ్మణము, బలవత్తర ప్రతిబంధకనివృత్తికొరకు జపింపదగిన ఋఙ్మంత్రములు, జీవన హేతు క్షేత్రలాభముకొరకు జపింపదగు పృథివీ దేవతాకమగు మంత్రము, అనావృష్టిప్రతీకారమున కుపకరించు మంత్రము, త్రికాలసంధ్యావందనమునకు సంబంధించిన మంత్రములు, భోజనకాలిక ప్రాణాహుతి మంత్రములు, భోజనానంతరము జపింపదగు మంత్రములు, ఆ పైని తానే పరబ్రహ్మరూపుడనని అను సంధాన మొనర్చుట కుపకరించు మంత్రములు, మేధాశక్త్యభివృద్ధికొరకు జపింపదగిన ఋఙ్మంత్రములు ఈశ్వరుని అయిదుముఖములను ప్రార్థించుటకుపకరించు మంత్రములు, జ్ఞానమునకు ప్రతిబంధకమగు బ్రహ్మహత్యాది పాపనివృత్తికరములగు మంత్రములు, ప్రతిబంధకనివృత్త్యనంతరమందు కలుగు జ్ఞానయోగ్యతను కలుగజేయు హోమమంత్రములు, వైశ్వదేవమంత్రములు, ఇత్యాదులీపన్న మందున్నవి.

చివర, సర్వవేదములోను సర్వసాధారణసారమగు, సత్య, తపో, దమ, శమ, దాన, ధర్మ, ప్రజనన, అగ్నిహోత్ర, యజ్ఞ, ఉపాసనలను వివరించి, వీటివలన సంన్యాసము తద్వారా మోక్షము సిద్ధించునని నిరూపింపబడినది— చిట్టచివర యీను వాకములో సంన్యాసులగు జీవన్ముక్తుల దేహవ్యాపారము లన్నియు యాగరూపములేయని ప్రతిపాదింపబడినది. ఎట్లనగా వీరి ఆత్మయే యజమాని—శ్రద్ధయేపత్ని— శరీరమే ఇధ్మము— వక్షస్థలమే వేది— రోమములే బర్హిస్సు— శిఖయే వేదము (సంమార్జనకొరకు యాగములో నుపయోగించు దర్భకట్ట) హృదయమే యూపస్తంభము— కామమే ఆజ్యము— మన్యువే

వశువు- తపస్సే అగ్ని-సర్వేంద్రియోపశమకారియగు దమమే దక్షిణ- వీరి వాక్కే-హోత- ప్రాణమే ఉద్గాత- వీరిచక్షుస్సే అధ్వర్యుడు-మనస్సే బ్రహ్మ- శ్రోత్రమే అగ్నిధ్రుడు- వీరి దేహమున్నంతకాలమే దీక్ష- వీరు భుజించునదే హవిస్సు- వీరి ఉదకపానమే, సోమపానము- వీరి విహరణమే ఉప సత్తులు- వీరిసంచార, ఉపవేశ, ఉత్థానములే ప్రవర్గ్య-వీరి ముఖమే ఆహవనీయాగ్ని- పలుకులే ఆహుతి- వీరివిజ్ఞానమే హోమము- సాయంప్రాతః కాలికిభోజనమే సమిధలు- ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములే సవనత్రయము. అహోరాత్రములే దర్శపూర్ణిమాసయాగములు- పక్ష, మాసములే, చాతుర్మాస్యములు- ఋతువులే పశుబంధము- సంవత్సరభేదములే అహర్గణములను యాగవిశేషములు- సర్వకాలసమష్టియే సహస్రదక్షిణోపేత సత్రయాగము-

ఇట్లు తైత్తిరీయశాఖయంతయు అద్వితీయబ్రహ్మను బోధించునట్లును, ఋగ్యజుస్సామాదులన్నియు ఇందుకలసి యున్నట్లును మంత్రబ్రాహ్మణ ఉపనిషత్తులన్నియు నేకవాక్యత నొందియున్నట్లును, గ్రహించితిమి- ఇక ద్వితీయాది సంపుటములలో ఋక్సామాధర్వణ వేదములలోగూడ, ప్రతిపాతకములోను, ఏయే విషయములున్నవో వివరింపబడును.